# చందమామ కేమెల్

రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు




బహుమతులు గెలుచుకోండి

కేమెల్—మొదటి బహుమతి రు. 15

కేమెల్—2వ బహుమతి రు. 10

కేమెల్—3వ బహుమతి రు. 5

కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు

కేమెల్—10 సర్టిఫికెట్లు

ముక్కలు చుక్కల గీత వెంట కత్తిరించండి.

12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.

**P.B. No. 9928, COLABA, Bombay-400 005.**

ఫలితములు తుది నిశ్చయముగాన, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ______________________________ Age ____________

Address ________________________________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

VISION

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.

ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేది. *31-5-1980*

**CONTEST NO.14**



# చందమామ

మే 1980



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 1-50

సంవత్సర చందా: 18-00




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ సంచికలో "తోకచుక్క" రంగుల బొమ్మల సీరియల్, స్వర్గీయ చిత్రా రచించిన బొమ్మలతో సహా ప్రారంభ మవుతున్నది. ఈనాడు మా పాఠకులలో అత్యధిక సంఖ్యాకులకు ఇది కొత్త రచన. కాని పాత పాఠకులు కూడా తిరిగి చదవటానికి ఆత్రపడుతూ లేఖలు రాశారు.

ఈ నెల బేతాళకథకు ఆధారం ఎస్. వాహిద్ రచన.

## అమరవాణి

హిరణ్య, ధాన్య, రత్నాని, యానాని, వివిధాని చ
తథాన్య దపి 'యత్కించిత్ ప్రజాభ్యస్స్యా న్మహీపతేః.

[రాజులకు బంగారమూ, ధాన్యమూ, రత్నాలూ, రకరకాల వాహనాలూ, ఇంకేవిగానీ గాక, ప్రజల నుంచి రావలసిందే.]

సంపుటి 66 మే '80 సంచిక 5

విడి ప్రతి : 1-50 : : సంవత్సర చందా : 18-00

CHITRA




గేదెల హరిశంకర్ నాయుడు, రాయఘడ.

ప్ర: భూమికీ, భూమి మీద ఉన్న ప్రతి వస్తువుకీ ఆకర్షణ శక్తి ఉంది గనుక వస్తువులన్నీ భూమిని తాకి ఉన్నాయి. అదే విధంగా సూర్యుడు ఆకర్షించి ఉన్న గ్రహాలు సూర్యుణ్ణి ఎందుకు తాకి లేవు?

స: ఇందులో "వేగం" సమస్య ఉన్నది. రాకెట్ ప్రయోగాలతో అమిత వేగం అందుకున్న కృత్రిమ ఉపగ్రహాలను భూమ్యాకర్షణ భూమి చుట్టూ తిప్పగలదు గాని భూమి కేసి లాగలేదు. చంద్రుడు తన వేగం వల్లనే భూమి మీద పడకుండా, భూమి చుట్టూ తిరుగుతున్నది. అంతదాకా దేనికి? బంతి ఆటలో గట్టిగా తన్నిన బంతి భూమ్యాకర్షణకు విరుద్ధంగా పైకిపోయి, వేగం తగ్గినదాకా భూమికి తిరిగి రాదు. గ్రహాలు తమ వేగం వల్లనే సూర్యుడిలో పడకుండా, సూర్యుడి చుట్టూ నియమిత కక్ష్యలలో తిరుగుతున్నాయి.

వి. కె. యం. లక్ష్మణరావు, కోర్బా.

ప్ర: నీటికి రంగు లేదు. కానీ నీటిపై కాంతి పడినప్పుడు పరావర్తనం, లేదా శోషణం జరిగితీరాలి. అలా జరిగితే నీరు తెల్లగా గానీ, నల్లగా గానీ, లేదా ఏదో రంగులో గానీ కనబడాలి. అలా జరగదు. కారణం?

స: అన్ని రంగులూ గల సూర్యకాంతిని శోషించగల వస్తువులు నల్లగా కనిపిస్తాయి. కాంతిని పూర్తిగా పరావర్తన చెయ్యగల వస్తువులు తెల్లగా కనిపిస్తాయి. సూర్యకాంతిలోని కొన్ని రంగులను మాత్రమే పీల్చుకోగల వస్తువులు, పీల్చుకోబడని రంగులలో (ఉదా: ఆకులు ఆకుపచ్చరంగులో; పూలు వేరువేరు రంగులలో) కనిపిస్తాయి. నీరు ఏ రంగునూ పీల్చుకోలేదు. అందుచేత నీటి గుండా కాంతి ప్రసరించినప్పుడు అన్ని రంగులూ కనిపిస్తాయి. కాంతిని పరావర్తన చేసే శక్తి కొంతవరకు నీటికి ఉన్నది. రాత్రిపూట కాలవలలో అన్ని రంగుల కాంతులూ ప్రతిఫలించటం మనం చూడగలం. నీటికి స్వతహాగా రంగు లేకపోవటానికి ఇదే కారణం.




## 83

మగధదేశంలో చంపకవతి అనే అరణ్యంలో ఒక కాకీ, ఒక లేడీ చాలా కాలంగా స్నేహం చేస్తూ ఉండేవి. లేడి బాగా కండపట్టి, నేవళంగా ఉండేది.

ఒకనాడు అది అరణ్యంలో యథేచ్ఛగా తిరుగుతూండగా, ఒక నక్క దాన్ని చూసి, ''దీని కమ్మని మాంసం ఎలా రుచి చూడాలి? అందుకు ఒకటేమార్గం: దానికి - నాలో నమ్మకం కుదిరేలాగా చేయాలి,'' అనుకుని, లేడిని సమీపించి, ''మిత్రమా, కులాసాగా ఉన్నావా?'' అని అడిగింది.

''ఎవరు నువు?'' అని లేడి అడిగింది.

''నేను క్షుద్రబుద్ధి అనే నక్కను. నేను నా వారినందరినీ పోగొట్టుకుని ఇక్కడ కుంటి జీవితం గడుపుతున్నాను. ఇప్పుడు మనం మిత్రులమయాం కనక, నా జీవితం ఇంక నాలుగు కాళ్ళమీద నడుస్తుంది. నేను శాశ్వతంగా నీ వెంట ఉండగోరుతున్నాను,'' అన్నది నక్క.

''అలాగే,'' అన్నది లేడి.

సూర్యాస్తమయం అయినదాకా ఆ రెండూ కలిసి తిరిగి, లేడి ఇంటికి చేరాయి. లేడితో దీర్ఘకాల స్నేహంగల సుబుద్ధి అనే కాకి ఒక చంపకవృక్షం కొమ్మ మీద కూర్చుని ఉండి, లేడి తన వెంట ఒక నక్కను తీసుకురావటం చూసి, ''మిత్రమా, ఇది ఎవరు?'' అని అడిగింది.

''ఈ నక్క మనతో స్నేహం కోరుతున్నది,'' అన్నది లేడి.

దానికి కాకి, ''మిత్రమా, అపరిచితులతో ఆకస్మిక స్నేహం మంచిది కాదు. ఒకరి కులగోత్రాలూ, స్వభావమూ తెలియకుండా ఆశ్రయమియ్యరాదు.



ఒక పిల్లి చేసిన మోసం వల్ల జరద్గవం అనే రాబందు తన ప్రాణాలు కోల్పోయింది,'' అన్నది.

''అది ఎలా జరిగింది?'' అని లేడి కాకిని అడిగింది.

కాకి ఇలా చెప్పింది :

జరద్గవా, దీర్ఘకర్ణులు

గంగాతీరాన గృధ్రకూట మనే కొండ మీద ఒక పెద్ద చెట్టుతొర్రలో జరద్గవం అనే రాబందు నివసిస్తూ ఉండేది. దురదృష్ట వశాన దాని కళ్ళూ, గోళ్ళూ పోయాయి. ఆ చెట్టు మీద నివసించే పక్షులు దాని మీద జాలిపడి, తమ ఆహారంలో నుంచి దానికి కొంత కొంత ఇచ్చేవి. అది వాటిపై ఆధారపడి బతుకుతూ, పెద్ద పక్షులు ఆహారం కోసం వెళ్ళినప్పుడు, వాటి పిల్లలను కనిపెట్టి ఉండేది.

ఒకసారి పెద్ద పక్షులు బయటికి వెళ్ళి ఉన్న సమయంలో వాటి పిల్లలను తినటానికి దీర్ఘకర్ణం అనే పిల్లి వచ్చింది. దాన్ని చూసి పక్షి పిల్లలు భయపడి గగ్గోలుపెట్టాయి. రాబందు రావటం చూసి, దీర్ఘకర్ణం తనలో, ''అయ్యో, నా పని అయిపోయింది! అయినా, అపాయం రానంత వరకే దాన్ని గురించి భయపడాలిగాని, తీరావచ్చి పడ్డాక అపాయం నుంచి బయటపడే మార్గం ఆలోచించాలి. ఇది నన్ను చూడనే చూసింది గనక, పారిపోయి లాభంలేదు. ఏమయితే కానీ, నేను దీన్ని ముందు నమ్మించి, తరవాత సమీపిస్తాను,'' అనుకున్నది.

''అయ్యా, నా నమస్కారాలు స్వీకరించండి,'' అన్నది పిల్లి.

''ఎవరు నువు?'' అని రాబందు అడిగింది.

''నేను పిల్లిని,'' అన్నది దీర్ఘకర్ణం.

''ముందు వెళ్ళిపో. నేను నీ ప్రాణం తీయగలను,'' అన్నది రాబందు.

''నా మాట కాస్త ఆలకించి, నన్ను చంపాలని తమకుతోస్తే అలాగే చెయ్యండి. ఒక కులానికో, జాతికో చెందిన మాత్రాన

ఎవరినిగాని గౌరవించటమూ, చంపటమూ భావ్యమవుతుందా? ఎవరి ప్రవర్తనగాని ఎలా ఉన్నదీ తెలుసుకున్న మీదటనే గదా సన్మానించటమో, చంపటమో చేస్తాం?'' అన్నది పిల్లి.

''నువు ఇక్కడికి ఎందుకు వచ్చావు?" అని రాబందు అడిగింది.

''నేను ఈ పవిత్రమైన గంగాతీరాన నివసించుతూ, రోజూ గంగాస్నానాలు చేస్తూ, బ్రహ్మచర్యం అవలంబించి చాంద్రాయణ వ్రతం చేస్తున్నాను. తమరు స్మృతులు అధ్యయనం చేస్తూంటారని నమ్మకంగా కొన్ని పక్షులు చెప్పగా విని, వయోవృద్ధులూ, జ్ఞానవృద్ధులూ అయిన తమ నుంచి ధర్మసూక్ష్మాలు తెలుసుకోగోరి వచ్చాను. మీకు అతిథిగా వచ్చిన నన్ను తమరు చంపుతాననే సరికి తమకు ధర్మాలు తెలియవని గ్రహించాను. ఇంటికి అతిథిగా వచ్చిన శత్రువుకు కూడా తగిన అతిథ్య మియ్యాలని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. తనను కొట్టటానికి వచ్చిన వాడికి కూడా చెట్టు నీడనిస్తుంది. వెళ్ళగొట్టబడిన అతిథి తనను వెళ్లగొట్టిన గృహస్థు పుణ్యం యావత్తూ పట్టుకు పోతాడు. అధమ వర్ణస్తుడు తన ఇంటికి వచ్చినప్పుడు అగ్రవర్ణస్తుడు కూడా గౌరవించాలి. ఎందుకంటే, అతిథి అందరి దేవతలకూ ప్రతినిధి.'' అన్నది పిల్లి.

దానికి రాబందు, ''పిల్లులకు రెక్కలు రాని పక్షులను తినటం ఇష్టం. ఇక్కడ



రెక్కలురాని పక్షి పిల్లలు ఉన్నాయి. అందుకని నేను అలా అన్నాను,'' అన్నది.

పిల్లి నేలను తాకిన చేతులతో తన చెవులను తాకి, ''నేను స్మృతులు చదువుకున్నాను. వికారాలు వర్జించాను. చాంద్రాయణ ఉపోషాలు చేస్తున్నాను. అనేక విషయాలలో ధర్మశాస్త్రాలు పరస్పరం భేదించినప్పటికీ, అహింస పరమధర్మం అన్న విషయం ఏకగ్రీవంగా ఒప్పుకుంటున్నాయి. దానికి వేరేకారణం లేదు; ఇతరులకు ఎలాటి హానీచేయక, ఇతరులు తనకు చేసిన హానిని క్షమించినవాడు తిన్నగా స్వర్గానికి పోతాడు. చచ్చిపోయినాక సంచితపుణ్యం ఒకటే వెంటవచ్చేది; మిగిలినదంతా దేహంతోపాటే నశిస్తుంది. తినేవాడికి తాత్కాలిక జిహ్వాచాపల్యం మాత్రమే తీరుతుంది. తినబడేవాడు తన ప్రాణాన్నే కోల్పోతాడు. చావు వచ్చిపడుతూంటే మనిషి చెందే ఆవేదన ఇతరులు గ్రహించరానిదీ, వర్ణించలేనిదీనూ. అడవిలో తమంతట తాము పెరిగే ఆకులూ, అలములూ తిని నింపుకోదగిన వెధవపొట్ట కోసం ఎవడైనా ఇతరుల ప్రాణాలు తీసి, పాపం కట్టుకుంటాడా?'' అన్నది.

రాబందు ఈ మాటలకు మోసపోయి, పక్షులకు తెలియకుండా, పిల్లిని చెట్టు తొర్రలో తనతోబాటు ఉండనిచ్చింది.

రాబందును మాటలతో మోసగించి, దానిచెట్టు తొర్రలో చేరిన పిల్లి రోజూ ఏదో ఒక పక్షిపిల్లను పట్టి తొర్రలోకి తెచ్చి, అక్కడ దాన్ని తింటూ వచ్చింది.

కొంతకాలం గడిచినాక తమ పిల్లలను పోగొట్టుకున్న పక్షులు హంతకుడెవరని తేల్చటానికి సమావేశం జరిపాయి. అవి తన ఆచూకీ తెలుసుకునే ప్రయత్నంలో ఉన్నాయని తెలియగానే, పిల్లి చెట్టు తొర్రను విడిచి చల్లగా వెళ్ళిపోయింది.

పక్షులు ఆ ప్రదేశమంతా గాలించి, చివరకు చెట్టుతొర్రలో ఎముకలు చూసి, రాబందే తమ పిల్లలను తిన్నదని నిర్ధారణ చేసుకుని దాన్ని చంపేశాయి






పూర్వకాలమందు కుండలినీ ద్వీప రాజ్యానికి, చిత్రసేనుడు ప్రభువుగా వుండేవాడు. ఆయన రాజ్యాధికారానికి వచ్చి రెండు సంవత్సరాలైనా గడవక ముందే, ప్రజల మేలుకోసం అనేక పథకాలు అమలు చేశాడు. ప్రజలు సమస్త సౌఖ్యాలూ అనుభవించాలనీ, తన రాజ్యం రామరాజ్యం అనిపించుకోవాలనీ, ఆయనకు ఎంతో కుతూహలంగావుండేది. ఈ కారణంగా చిత్రసేన మహారాజు ప్రజలపై పన్నులన్నీ సగానికి సగం తగ్గించి వేశాడు.

రాజు ధర్మగుణానికి ప్రజలు ఎంతగానో సంతోషించారు. పన్నుల భారం తగ్గటంతో ప్రజలకు సుఖంగానే వున్నది. రాజ్యంలో ఎక్కడ చూసినా చిత్రసేనుడి ధర్మగుణాన్ని స్తుతించేగాథలే, ఏమూల విన్నా ఆయనను కీర్తించే పాటలే!

ఇదంతా బాగానే వున్నది! ధర్మగుణం గల రాజు పేరు దశ దిశలా మోగిపోవటం సంతోషించదగిందే. కాని అటు పేరు మోగుతున్న కొద్దీ, యిటు ఖజానాలో ద్రవ్యం తరుగుతూ వచ్చింది. అదేపనిగా ఖర్చు పెడుతూవుంటే, ఎంత ధనం మాత్రం నిలుస్తుంది! ధనం లేకపోవడం చేత పరిపాలన తారుమారు కాజొచ్చింది.

చిత్రసేనుడి ప్రధాన మంత్రి బుద్ధి సూక్ష్మత కలవాడు. ఆయన రాజు సంకల్పం గమనించే వున్నాడు. అందువల్ల రాగలఫలితాలు కూడా ఆయనకు




ముందుగానే తెలుసు. అందుకనే, అవకాశం దొరికినప్పుడల్లా, రాజుతో మంచి చెడ్డలు చెబుతూనే వచ్చాడు. కాని, చూడబోతే, "నా తరంలో, నా ప్రజలకు శాశ్వతమైన మేలుచేసి తీరాలి!" అని దీక్షపట్టిన చిత్రసేనుడికి, మంత్రి మాటలు చెవికెక్కలేదు.

ఖజానా ఖాళీ అయే దశకు వచ్చింది. ఇక ఊరుకుంటే ముప్పుకలుగుతుందని మంత్రి ఒక నాడు చొరవతీసుకుని, రాజు చిత్రసేనుడితో, "మహారాజా! ఏలిక చేసిన శాసనం ప్రజలకు సౌఖ్యంగానే వున్నది. ఐతే, మన ధనాగారం ఒక వంక పట్టిపోతున్నది. ధనం లేకపోతే ఏ పనీ సాగదుగదా! మాట దక్కని మంత్రి పదవి, నే నెలా నిర్వహించేది? నన్నీ బాధ్యతనుంచి తప్పించవలసిందిగా ప్రభువులవారిని కోరుతున్నాను," అన్నాడు.

"అంత విషమించిందా పరిస్థితి?" అని రాజు ప్రశ్నించాడు.

"ఏమని మనవిచేసేది, మహారాజా! అవతల ఉద్యోగులకూ, యివతల సైనికులకూ నెల జీతాలివ్వాలి. ఇంకొక్క వారమే వ్యవధివున్నది. ఖజానాలోవున్న సొమ్ముతో నీళ్ళు మోసే తోటమాలీల భత్యాలైనా సరిపెట్టలేమని తోస్తున్నది." అన్నాడు మంత్రి.

రాజు చిత్రసేనుడు కొంచెం ఆలోచించి, "సరే, రేపటి రోజున దర్బారు ఏర్పాటు చేయించు, మహామంత్రీ! రాజోద్యోగులతోపాటు, రాజ్యంలోని ముఖ్యులందరూ కూడా సభకు వచ్చేలా చూడు," అన్నాడు.

మంత్రి, "చిత్తం! అలాగే చేస్తాను," అని యివతలికి వచ్చాడేగాని ఆయనకు దర్బారు ఏర్పాటు చేయమనటంలో రాజు అభిప్రాయం ఏమిటో తెలియలేదు.

రాజ్యంలో దండోరా వేయించారు. అది విన్న ప్రజలకు దర్బారు ఎందుకు ఏర్పాటు చేస్తున్నారో అర్థం కాలేదు. ఆకారణంగా నలుగురూ నాలుగు

విధాలుగా అనుకోసాగారు. రాజు దయామయుడన్న సంగతి అందరికీ తెలిసినదే. అందువల్ల వాళ్ళల్లో కొందరు, "అసలు పన్నులు మొత్తంగానే తీసివేస్తాడు, మహారాజు!" అంటూ వదంతులు వ్యాపింపచేశారు.

మర్నాడు దర్బారు ఏర్పాటయింది. సలహాదార్లూ, రాజోద్యోగులూ, రాజ్యంలో పేరు మోసిన పెద్దమనుష్యులూ వచ్చారు. చిత్రసేనుడు వచ్చి సింహాసనం అధిష్ఠించాడు. ఆయన ఆజ్ఞకాగానే ముఖ్యమంత్రి సభవారితో, "అసలు మన రాజ్యంలో, పూర్వం విధించబడి అమలులోవుంటున్న పన్నులే నామమాత్రమైనవి. అటువంటిది, యిప్పుడు కరుణాసింధువులని బిరుదు వహించిన మన మహారాజుగారి హయాంలో, ఆ పన్నులు కూడా సగానికి సగం తగ్గిపోయిన సంగతి, అందరికీ తెలిసినదే! ఈ నామమాత్రపు పన్నులతో రాజ్యపాలన ఎలా సాగటం అన్నది యిప్పుడొక తీవ్రసమస్య అయి కూర్చున్నది," అంటూ గుక్క తిప్పుకునేందుకు ఒక్క క్షణం ఆగాడు.

అంతలో సభలో నుంచి ఒకడు లేచి, "ప్రజల మీద పన్నులు వేయకుంటే, పరిపాలన సాగనేసాగదా?" అని ప్రశ్నించాడు.



ఈ ప్రశ్నకు సభలో వున్నవాళ్ళంతా విస్తుపోయారు. ముఖ్యమంత్రికి మతి పోయినంత పనైంది. ఆయన ప్రశ్నించిన సభికుడి కేసి ఒక్క క్షణం కోపంగా చూసి, "మీరే ఆలోచించండి, మన రాజ్యంలో జనాభా ఎంత? అంతమందీ సుఖంగా కాలం గడపాలంటే ఎన్నెన్ని సౌకర్యాలు కావాలి. ఆరోగ్యం కాపాడుకునేందుకు మందు మాకులూ వద్దా? పెరిగి పెద్ద కావలసిన బిడ్డలకు చదువు సంధ్య లక్కరలేదా? అంతే కాక పరరాజులు ఏక్షణాన అయినా మన మీదికి దాడిరావచ్చు. అలాంటి దాడులను నిరోధించేందుకు సైన్యం అవసరంకదా?




పన్నులు వేయకపోతే వీటన్నిటికీ ధనం ఎలా వస్తుంది? కనక, పన్నులంటే ఏమిటో, వాటిని ఎందుకు విధించాలో తెలుసుకోవటం ప్రతిపౌరుడికీ విధి....'' అని చెపుతూవుండగా, రాజు చిత్రసేనుడు, తానేదో మాట్లాడ దలచినట్టు మంత్రి కేసి చూశాడు. మంత్రి ఆగిపోయాడు.

''మంత్రిగారు చెప్పినదంతా బాగానే వున్నది. అయితే ఒకసారి తగ్గించిన పన్నులను తిరుగా విధించినట్టయితే, మునుపటి పద్ధతిలో వసూలు చేయగలమా అన్నది ప్రశ్న.'' అన్నాడు రాజు.

సభలో గుసగుసలు బయలుదేరినై. అంతలో ఒకడు నిర్భయంగా లేచి, ''మహారాజా! తగ్గించిన పన్నులు తిరుగా పెంచడమనేది, బాగా ఆలోచించవలసిన సమస్య. మన రాజ్యంలోనే కాక, పర రాజ్యాలకు కూడా వ్యాప్తిచెందుతున్న తమ కీర్తి కాస్తా, కొత్తపన్నులు విధించడంతో, హారతికర్పూరంలా హరించి పోతుంది. మహీపతులు మాట తప్పడమనేది సామాన్య విషయంకాదు.'' అన్నాడు.

ఈ హెచ్చరికలో రాజుకు గొప్ప యదార్థం గోచరించింది. తను సింహాసనం ఎక్కినప్పటి నుంచీ, యిప్పటివరకూ ఆర్జించుకు వస్తున్న యశస్సు, క్షణాల మీద హరించుకు పోతుంది! అందువల్ల తగ్గించిన పన్నులు పెంచడానికి ఎంత మాత్రం వీలులేదు! ధనాగారం నింపటానికి వేరే ఏదైనా మార్గాలున్నవేమో ఆలోచించవలసిందే, అనుకున్నాడాయన.

''పన్నుల విషయమై ఒకసారి చేసిన నిర్ణయాన్ని, మేము మార్చదలచలేదు. కొత్త పన్నులు విధించటం అన్న సమస్యే తల ఎత్తరాదు. ఇదీ మా నిర్ణయం! మంత్రిగారు పరిస్థితి అంతా వివరించారు. ఈ విషయమై ఏమిచేస్తే బావుంటుందో సభికులు ఆలోచించండి,'' అన్నాడు. చిత్రసేన రాజు.

సభ అంతా నిశ్శబ్దమైపోయింది. సభికులంతా ముఖముఖాలు చూసు

కోవటమేగాని, ఏం జవాబు చెప్పాలో ఒకరికీ తోచిందికాదు. ఒకటి, రెండు నిమిషాలకాలం గడిచిం తరవాత సేనాధిపతి అయిన సమరసేనుడు లేచి, ''మహారాజా! ధనాగారం నింపడం అనేది పెద్ద సమస్య కానేకాదు. అందుకు మార్గం నేను చెప్పగలను. అయితే, అది చాలా గుప్తవిషయం. తమతో ఏకాంతంలో మనవిచేస్తాను,'' అన్నాడు.

ఇందుకు అంగీకార సూచకంగా సభలో వున్న వాళ్లంతా కరతాళధ్వనులు చేశారు! ఆనాటి రాత్రి పదిగంటలవేళ సేనాని, మహారాజును ఉద్యానవనంలో కలుసుకుని, ఆగుప్తవిషయం ఏదో తెలియపరచవలసిందిగా ఏర్పాటు జరిగింది.

ఆ రాత్రి పదిగంటలవేళ సేనాని సమరసేనుడు ఉద్యానంలో రాజు చిత్రసేనుణ్ణి కలుసుకుని, ''మహారాజా! మన ధనాగారం నింపేందుకు యింతగా యోచించవలసిన పనిలేదు. పరిస్థితిని బట్టి, మన రాజ్యంలో ఒక్క పైసా అయినా అదనంగా వసూలయే మార్గం లేదు. ధనం ఏలా సంపాయించాలి? ప్రజలను సుఖపెట్టి, మన రాజ్యం రామరాజ్యం అనేఖ్యాతి నిలబెట్టుకోవటం ఎలాగ? ఇదేగదా సమస్య? ఇందుకు ఒక్కటే ఒక్క మార్గం కనబడుతున్నది.



మనం పర రాజ్యాల మీద దాడిచేసి, వాళ్ళ ధనాగారాలను కొల్లగొట్టితే సరి! ఇది రాజధర్మాల్లో ఒకటిగదా, మహారాజా! ఇలాంటి అవసరాల కోసమేగదా, సేనాధిపతులల్నీ, సేనల్నీ పోషించేది,'' అని విన్నవించుకున్నాడు.

చిత్రసేనుడు కొంచెంసేపు ఆలోచించి, ''సమరసేనా, నీ ఆలోచన బాగానే వున్నది. కాని, యిందులోవున్న చిక్కు సంగతి నువ్వు గమనించినట్టు లేదు. అసలు మన రాజ్యమే ద్వీపంగదా? మనకు అన్ని వైపులా సముద్రాలే కద! ఈ సముద్రాలన్నీ దాటుకుంటూపోయి, పొరుగు రాజ్యాలమీద దాడిచేయాలంటే,

సేనానాయకుడు, రాజు దగ్గిర సెలవు తీసుకునిపోయి, సైన్యంలోని దళనాయకు లందర్నీ సమావేశపరిచి, వాళ్ళకు రాజు గారితో తాను మాట్లాడినదంతా వివరించి, ''అంతా బాగానేవున్నది. కాని ఒకే ఒక సందేహం నన్ను బాధిస్తున్నది,'' అన్నాడు.

''ఏమిటా సందేహం?'' అని అడి గారు దళనాయకులు.

''మనం సైనికులను వెంటబెట్టుకుని చుట్టుపక్కలవున్న ద్వీపాలమీద దాడి చేయటం కేవలం అక్కడి ధనాగారాలను కొల్లగొట్టుకు రావటానికే. అంతేగాని, మనం ద్వీపాలను ఆక్రమించి పరిపాలించ బోవటం లేదు. ఆ మాత్రం పనికి మన కిప్పుడున్న సైనికబలం చాలునేమో అనుకుంటున్నాను. మరొకటి; మనం సైన్యాలతో, యీ ద్వీపం వదిలిపోగానే, అవకాశం కోసం చూసే రాజద్రోహు లెవరైనా ప్రజలను రెచ్చగొట్టి, తిరుగు బాటు చేయవచ్చు. అప్పుడు మన రాజు గారినీ, రాజబంధువులనూ రక్షించే దెవరు?'' అన్నాడు సేనానాయకుడు.

''అవును, యిది గడ్డుసమస్యే! సైన్యం లేని రాజు పూచికపుల్లకు కొరగాడు,'' అన్నాడు ఒక దళనాయకుడు.

సేనాని సమరసేనుడు ఏదో చెప్ప బోయేంతలో ఒక ముసలియోధుడు



మనకు ఎంత నౌకాబలం, ఎంత సైనిక బలం కావలసివుంటుంది! ఆ సంగతి ఆలోచించావా?'' అని ప్రశ్నించాడు.

''ఆ నౌకాబలం, సైనికబలాల సంగతి నాకు వదలండి, మహారాజా!'' అన్నాడు సేనానాయకుడు.

''సరే, అలా అయితే, ఆ బాధ్యత అంతా నీదే! మన సైనికశక్తిని పెంచా లంటే, ఎంతోమంది కొత్తవాళ్ళను సైన్యం లోకి చేర్చవలసివుంటుంది. అందుకు రాజాజ్ఞ అవసరం. ఇదుగో, ఈ రాజ ముద్రికను ఉపయోగించుకో,'' అంటూ రాజు తన వేలిఉంగరం తీసి, సేనానాయ కుడికి యిచ్చాడు.

గొంతెత్తి, "సేనానీ! కుండలినీదేవి కరుణ వల్ల, యిప్పుడే నాకొక చక్కని ఉపాయం తట్టింది!" అన్నాడు.

అందరూ అతడి కేసి చూశారు. "వినండి! దేశంలో తిరుగుబాట్లూ, విప్లవం లాంటివి ప్రారంభించాలంటే, అందుకు యువకులేగదా పూనుకోవలసింది? అందువల్ల మనం దేశంలోని యువకుల్ని ఏదోవిధంగా ఆకర్షించి, సైన్యంలో చేర్చుకోవటం ఉత్తమమార్గం," అన్నాడు ముసలియోధుడు.




ఈ ఉపాయం సేనాని సమరసేనుడితో పాటు, అక్కడ సమావేశం అయిన అందరికీ నచ్చింది. వాళ్లు అప్పటికప్పుడే సంప్రతింపులు జరిపి, రాజ్యంలోని పదిహేను, నలభైఏళ్ల మధ్యవయసు వాళ్లంతా సైన్యంలో చేరవలసిందిగా ఉత్తరువులు జారీచేస్తూ, ఆజ్ఞాపత్రాలను రాజముద్రికతో సహా తయారుచేశారు.

మర్నాటి నుంచీ సైనికులు ఆజ్ఞాపత్రాలు చేత పుచ్చుకుపోయి, ప్రతి గ్రామంలోనూ వయసులోవున్న ప్రతి పురుషుణ్ణీ సైన్యంలో చేర్చసాగారు. కాని కొందరు సైన్యంలో చేరటానికి అయిష్టత కనబరుస్తూ, "అయ్యా, కావాలంటే రాజుగారిని కొత్త పన్నులు విధించమనండి, సంతోషంగా యిచ్చుకుంటాం. అంతేగాని పరదేశాల మీద దాడికోసం మమ్మల్ని బలవంతంగా సైన్యంలో చేర్చవద్దు. మమ్మల్ని తల్లిదండ్రుల నుంచీ, ఆలు బిడ్డల నుంచీ ఎడంచేయకండి." అంటూ దీనంగా మొరబెట్టుకున్నారు.

ఆజ్ఞాపత్రాలతో బయలుదేరిన సైనికులు, యిది రాజాజ్ఞ అంటూ, యిష్టంతో సైనికులుగా చేరిన వారిని మర్యాదగానూ, మిగతా వాళ్ళను కాళ్ళూ, చేతులూ కట్టి డోలీలలో పడవేసి, నగరానికి మోసుకుపోయారు.

ఈ బలవంతపు సైనికోద్యోగం యిష్టం లేనివాళ్ళు చాలా మంది, సైనికుల కంట బడకుండా తప్పించుకుపోయి, రాజుతో

మొరబెట్టుకున్నారు. రాజు చిత్రసేనుడు వాళ్ళు చెప్పినదంతా విని, ''నా ఘన కీర్తిని వేనోళ్ళచాటుతూ, మీలో కొందరు నాపైన కథలు రాయటమేగాక, కావ్యాలు కూడా అల్లారుకదా? అలాంటప్పుడు తిరిగీ నేను పన్నులు పెంచినట్టయితే, నా మీద మీరు తిట్టుకవిత్వాలు రాయడానికి అవకాశం యిచ్చిన వాణ్ణవుతాను. కనుక, యిప్పుడు చేయగలిగిందేమీ లేదు, ఆడితప్పటం మా వంశాచారం కాదు!'' అన్నాడు.

త్వరలోనే సైనిక సమీకరణ పూర్తి అయింది. ఒక శుభముహూర్తాన కుండలినీ సైన్యాలు ఓడలెక్కనై.

రాజు చిత్రసేనుడు, ''ఇక బయలు దేరండి!'' అంటూ ఆజ్ఞ యిచ్చేంతలో, దక్షిణదిశలోని ఆకాశంలో, మహావేగంతో కదులుతూ ప్రకాశిస్తున్న, ఒక తోకచుక్క కనబడింది. అది చూసి అందరూ భయంతో కంపించిపోతూ, ''అశుభం! అశుభం!'' అంటూ కేకలుపెట్టారు.

రాజుగారి పక్కనే నిలబడివున్న ఆస్థాన దైవజ్ఞుడు, ''ఈ తోకచుక్క అపత్కరహేతువు! ఓడలు బయలుదేరకుండా ఆపండి. మరొక సుముహూర్తం ఏర్పాటు చేస్తాను,'' అన్నాడు.

ఈ మాటలకు సేనాని సమరసేనుడు కోపం తెచ్చుకుని, ''ఇలాంటి అర్థం పర్థం లేని పిచ్చినమ్మకాలతో, చండప్రచండులైన మన సైనికుల్ని అవమానించకండి! తోకచుక్క వాళ్ళ నేమి చేయగలదు!'' అన్నాడు.

ఆస్థాన దైవజ్ఞుడు ఎంతగానో చెప్పి చూశాడు. సేనాని తనపట్టుదల వదలలేదు. చిత్రసేన మహారాజు కూడా సేనాని వైపే మొగ్గుచూపాడు. చేసేది లేక ఆస్థాన దైవజ్ఞుడు పక్కకు తప్పుకున్నాడు.

సేనాని సమరసేనుడు ఆజ్ఞాపించగానే ఓడల లంగర్లులాగి, తెరచాపలు ఎత్తారు. ఓడలు కదిలి, దక్షిణదిక్కున ప్రకాశిస్తున్న తోకచుక్కకు అభిముఖంగా బయలుదేరినై. —(ఇంకావుంది)






# పదవీత్యాగం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్లి, చెట్టుపై నుంచి శవాన్నిదించి, భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, సాధారణంగా మనుషులు లోకంతమని తమశక్తికి తగినంతగా ఆదరించదనుకుంటారు. సేవకుడు తన సేవను యజమాని మెచ్చుకుని, సన్మానిస్తే పొంగిపోతాడు. కాని దయానిధి లాంటివాడు, రాజుగారు తన సేవను గుర్తించి, అత్యున్నత పదవి ఇస్తే, దాన్ని నిరాకరించినప్పుడు అతన్ని ఏమనాలి? నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు దయానిధి పదవీత్యాగం చేసిన ఉదంతం గురించి చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

కళింగ దేశపు రాజు మార్తాండుడి సేనలో దయానిధి అనేవాడు ఒక దళ

## బేతాళ కథలు



పతిగా ఉండేవాడు. వీరుడుగా అతను ఎంతటివాడో రుజువు అయే అవకాశం కలగలేదుగాని, యుద్ధతంత్రం గురించి ఎప్పుడూ ఆలోచిస్తూ, అనేక రకాల పరిస్థితులను ఎలా ఎదుర్కోవాలో ఊహించుకుంటూ ఉండేవాడు.

ఒక రోజు మార్తాండుడు భారీ ఎత్తున వేటకు బయలుదేరిపోతూ, కోటకు దయానిధిని రక్షకుడుగా నియమించి వెళ్ళాడు. రాజుగారి కొలువులో ఉండే ప్రముఖ సైనికాధికారులందరూ వేటకు వెళ్ళారనీ, కోటకు దాదాపు రక్షణ లేదనీ చారుల ద్వారా విని, పొరుగురాజు వీరవర్మ ఆకస్మికంగా వచ్చి కళింగ కోటను ముట్టడించాడు. ఇలాటి పరిస్థితి వస్తే ఏం చెయ్యాలో ఎప్పుడో ఆలోచించి ఉంచుకున్న దయానిధి, కోట రక్షణకు ఉన్న సైనికులనూ, ఇతర యువకులనూ కోట గోడల మీదికి ఎక్కించి, శత్రుసైనికుల మీద ఆయుధాలతోబాటు రాళ్ళూ, అగ్నిబాణాలూ కురిపించి, వారిలో భీభత్సం కలిగించాడు. చావగా మిగిలిన శత్రుసైనికులు పారిపోయారు. దయానిధి చచ్చిన సైనికులను పాతిపెట్టించి, గాయపడిన వారికి కోట లోపల చికిత్స చేయించాడు.

కోట మీద జరిగిన దాడి గురించి తెలిసి, రాజు తన పరివార తో వెంటనే తిరిగి వచ్చి, దయానిధి సాధించిన మెరుపు విజయాన్ని మెచ్చుకున్నాడు అయితే, శత్రు సైనికులకు అతను చికిత్సలు చేయిస్తూండటం మార్తాండుడికి నచ్చలేదు. ఆయన వారందరికీ ఉరిశిక్ష విధించి, చంపించాడు.

మార్తాండుడి ఆగ్రహం అంతతో తీరలేదు. ఆయన తన సేనలన్నిటినీ తీసుకుని వీరవర్మ మీదికి యుద్ధానికి వెళ్లాడు. ఇలాటి దేదో జరుగుతుందని ఊహించిన వీరవర్మ ఇరుగు పొరుగు రాజుల సహాయం అర్థించి, సమిష్టి సేనలతో మార్తాండుడి సేనలను చిత్తుగా ఓడించి, మార్తాండుణ్ణి ఖైదీగా పట్టుకుని చెరలో



పెట్టించి, యుద్ధఖైదీలను బానిసలుగా కూలిపనులకు నియోగించాడు. వీరవర్మ సేనలు కళింగనగరాన్ని కొల్లగొట్టాయి.

దయానిధి మాత్రం తప్పించుకుని, నగరంలో మామూలు పౌరుడుగా రహస్య జీవితం గడుపుతూ వచ్చాడు.

వీరవర్మ సాధించిన విజయం కళింగ పౌరులకు ప్రాణాంతక మయింది. సైనికులు సంపదను కొల్లగొట్టి, ప్రజలను చిత్తం వచ్చినట్టు హింసిస్తూ వచ్చారు.

ఇది చూసి దయానిధి సహించలేక పోయాడు. అతను కొందరు ధైర్యసాహసాలు గలవాళ్ళను చేరదీసి, రహస్యంగా పథకం వేసి, ఒక రోజు రాత్రి రాజభవనంలో తిరుగుబాటు లేపి, వీరవర్మనూ, అతని కింది ముఖ్యోద్యోగులనూ పట్టుకుని, మార్తాండుణ్ణి చెరవిడిపించాడు.

తమ రాజు విముక్తి పొందగానే కళింగ నగరవాసులు తమను పీడిస్తున్న శత్రు సైనికులు మొదలైన వారిని, అతి సులువుగా మట్టుపెట్టారు.

మార్తాండుడు తిరిగి సింహాసనం మీద కూర్చుంటూనే వీరవర్మకు శిరశ్ఛేదమూ, అతని కింద పని చేసిన ముఖ్యోద్యోగులకు ఉరిశిక్ష విధించాడు. ఇలా శిక్షలు విధించిన సభలోనే మార్తాండుడు దయానిధి చూపిన నైపుణ్యాన్ని ఘనంగా మెచ్చుకుని, అతన్ని త్వరలో సర్వసేనాధిపతిగా నియమించ బోతున్నట్టు ప్రకటించాడు.

ఆ రాత్రే దయానిధి రాజును ఏకాంతంగా కలుసుకుని, మహారాజా, మీరు నా కివ్వబోతున్న సర్వసేనాధిపతి పదవిని నిరాకరిస్తున్నందుకు మన్నించండి. ఆ పదవి నిర్వహించే శక్తి నాకు లేదు," అన్నాడు వినయంగా.

మార్తాండుడు అతని కేసి తేరిపార జూసి, "సరే, నీ ఇష్టం, కాని నువు తెల్లవారేలోపల రాజ్యం విడిచివెళ్ళు. లేని పక్షంలో నీ ప్రాణాలు నీవి కావు!" అన్నాడు.

"చిత్తం, మహారాజా!" అంటూ దయానిధి రాజు వద్ద సెలవు పుచ్చుకుని,

అ రాత్రికి రాత్రే బయలుదేరి దేశాంతరాలకు వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, దయానిధి పదవీత్యాగం చెయ్యటానికి కారణం ఏమిటి? అంత పెద్ద పదవిని తాను నిర్వహించలేననా? అతని సంగతి అలా ఉండగా, రాజు ప్రవర్తనకు అర్థం ఏమిటి? ఆయన దయానిధిని దేశబహిష్కరణ ఎందుకు చెయ్యవలసి వచ్చింది? ఎవరూ చెయ్యలేని, మరువరాని సహాయం దయానిధి తనకు చేసి, పోయిన సింహాసనాన్ని తిరిగి ఇప్పించాడు గదా, అతన్ని మామూలు దళపతిగా ఉండనిస్తే నేం? తాను అభిమానించి ఇస్తున్న పదవిని నిరాకరించాడని రాజు దయానిధిపై ఆగ్రహించాడా? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దయానిధి అపారమైన రాజభక్తి గలవాడన్న నమ్మకంతో మార్తాండుడు అతన్ని సేనాధిపతి చేద్దామనుకున్నాడు. కాని దయానిధి తన ఆదరణను నిరాకరించగానే, అతన్ని ప్రేరేపించినది రాజ భక్తి కాదనీ, దేశాభిమానమనీ రాజు గ్రహించాడు. దయానిధి మానవతావాది. అందుకే క్షతగాత్రులైన శత్రుసైనికులకు చికిత్సచేసి, చచ్చిన వారిని పాతిపెట్టించాడు. వీరవర్మ ప్రజాకంటకుడుగా పరిపాలించి ఉండకపోతే, అతను బహుశా మార్తాండుడికి తిరిగి రాజ్యం ఇప్పించే ప్రయత్నం చేసేవాడు కాడు. ఇది తెలుసుకుని మార్తాండుడు అతనికి దేశబహిష్కరణ శిక్ష విధించాడు. రాజు దయానిధిని అలా శిక్షించకుండా వదిలితే, రేపు తన పరిపాలనలో నే ప్రజలు కష్టపడటం జరిగితే ఈ దయానిధే తనను దించెయ్యగలడని రాజుకు తెలుసు. అందుకే ఆయన అలాటి నిర్ణయం చేశాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# పోలికలు

"వెళ్ళిన పని ఏమయింది ?" అని భర్తకు మంచినీళ్లు అందిస్తూ పార్వతమ్మ అడిగింది.

రాజేశం మంచినీళ్ళు తాగి, "వాళ్ళకు మన రాగిణి నచ్చింది. అయితే, పదివేలు కట్నం కావాలని పట్టుబట్టుతున్నారు," అన్నాడు.

ఈ మాట విని పార్వతమ్మ నోరు వెళ్ళబెట్టింది.

వాళ్ళకు రాగిణి ఒకతే సంతానం. పెద్ద అందగత్తె కాదు. సర్వసాధారణంగా ఉంటుంది.

రాగిణి పుట్టిననాటినుంచీ రాజేశం ఆమె పెళ్ళి కోసం కూడబెట్టుతూ వచ్చినదంతా కలిపి అయిదువేలు.

రాగిణికి రెండు, మూడు సంబంధాలు చూశారు. కాని వారికి పిల్ల అంతగా నచ్చలేదు. ఇప్పుడు చూసిన సంబంధానికి పిల్ల నచ్చింది గాని, ఇచ్చుకోలేనంత కట్నం అడుగుతున్నారు!

రాగిణి అక్కడే ఉండి, తల్లిదండ్రుల సంభాషణ విని, "కట్నం కోసమే పెళ్ళి చేసుకునే మనిషి నాకు అక్కర్లేదు," అన్నది కోపంగా.

"నువు నోరుమూసుకుని అవతలికి పో!" అని కూతుర్ని కసిరింది పార్వతమ్మ.

తరవాత ఆమె తన భర్తతో, "వీళ్ళకు పిల్ల నచ్చింది. మనం డబ్బు కోసం చూస్తే ఈ సంబంధం కాస్తా తప్పిపోతుంది. ఇక దానికి ఈ జన్మలో పెళ్ళికాదు," అన్నది.

"అలా అని నన్ను ఏం చెయ్యమన్నావు? ఏ ఇంటికైనా కన్నం వెయ్యనా?" అన్నాడు రాజేశం చిరాకుగా.

ఇద్దరూ చాలాసేపు తర్జనభర్జనలు జరిపారు, కాని మరో అయిదువేలు ఎక్కడినుంచి తేవాలో తేల్చలేకపోయారు.

మాచిరాజు కామేశ్వరరావు



కొత్త మనిషికి రాజేశం మాటలతో అనుమానం వచ్చినట్టు కనబడింది. అతను ఒకసారి ఇంటి ముందున్న రావిచెట్టును చూసి, "రావిచెట్టు ముందున్న ఇంట్లో నారాయణకు ఇచ్చి రమ్మన్నాడు. ఇంతకూ మీరు నారాయణ కారా?" అని అడిగాడు.

రాజేశం నోరుతెరిచేలోపల, అతని వెనకనే ఉన్న పార్వతమ్మ కల్పించుకుని, "నువు రావలసిన ఇంటికే వచ్చావు, బాబూ. నిజానికి సుబ్బయ్యశ్రేష్ఠి నిన్ననే నగలు పంపించి ఉండవలసింది! అలస్యం ఎందుకు అయిందో కనుక్కో!" అన్నది తెలివిగా.

ఈ లోపల బాగా చీకటిపడిపోయింది. ఇంతలో ఎవరో వీధి తలుపు తట్టారు. రాజేశం వెళ్ళి తలుపు తీసి చూస్తే, బయట ఎవరో కొత్త మనిషి నిలబడి ఉంది, "సుబ్బయ్యశ్రేష్ఠి ఈ పెట్టెను మీకు ఇయ్యమన్నాడు. ప్రస్తుతం ఎనిమిదివేల రూపాయల నగలే పంపుతున్నాడట. శ్రేష్ఠికి ఏమైనా చెప్పమన్నారా?" అంటూ ఒక పెట్టె అందించాడు.

రాజేశానికి అంతా అయోమయంగా ఉన్నది. సుబ్బయ్యశ్రేష్ఠిని అతను ఎరగడు. "ఏ సుబ్బయ్యశ్రేష్ఠి దీన్ని పంపించాడు?" అని అతను కొత్త మనిషిని అడిగాడు.

అలాగే అని చెప్పి, ఆ మనిషి వెళ్ళిపోయాడు. రాజేశం చప్పున తలుపుమూసి, పెట్టె తెరిచాడు. పెట్టెలో కళ్ళు మిరుమిట్లుగొలిపే నగలు ఉన్నాయి.

"ఎనిమిదివేలు ఖరీదు చేసే నగలు! అమ్మాయి పెళ్ళి అయిపోయినట్టే!" అని ఆనందంగా అన్నది పార్వతమ్మ.

"నగలు ఎవరివో? నా పెళ్ళి ఎలా జరుగుతుంది?" అన్నది రాగిణి, గుమ్మంలో నిలబడి అంతా చూస్తూ.

"నువు నోరుమూసుకుని అవతలికి పో!" అని కసురుకుని, కూతుర్ని లోపలికి పంపించేసింది పార్వతమ్మ.

"దేవుడు మనని కనికరించి, కూతురి పెళ్ళి చేసుకోమని, ఈ నగలు పంపాడు. రెండురోజుల్లో వీటిని కరిగించి, అమ్మేస్తాను," అన్నాడు రాజేశం.

"దేవుడు అవకాశమైతే ఇచ్చాడుగాని దాన్ని మనం ఉపయోగించుకో వద్దూ? తెల్లవారేసరికి సుబ్బయ్యశ్రేష్ఠికి ఆ నగలు అందవలసిన చోట అందలేదని తెలిసి పోతుంది. రేపు ఆ మనిషి వచ్చి అడుగుతాడు! అప్పుడు ఏం చేద్దాం?" అన్నది పార్వతమ్మ.

"నిజమే! ఒక పనిచేద్దాం: నేను నగలపెట్టె పెరట్లో పాతిపెట్టుతాను; ఎవరైనా వచ్చి అడిగితే మాకేమీ తెలియదని చెబుదాం. వాడు నగలపెట్టె తెచ్చి మనకియ్యడం ఎవరు చూశారు గనక!" అన్నాడు రాజేశం.

తరవాత భార్యాభర్తలు నగలపెట్టెను తీసుకుపోయి, పెరట్లో కొబ్బరిచెట్టు కింద పూడ్చిపెట్టారు.

తెల్లవారి ఎవరో వచ్చి కేకలు పెట్టసాగారు. భార్యాభర్తలు ఒకరికొకరు ధైర్యం చెప్పుకుని, ముందు గదిలోకి వచ్చారు. క్రితం రాత్రి నగలపెట్టె తెచ్చిన మనిషి గుమ్మంలో నిలబడి ఉండి, ఎంతో ఆందోళనపడే ముఖంతో, "ఎంత మోసం! ఎంత దగా! నారాయణ పేరు చెప్పి



నగలపెట్టె తీసుకుంటారా? అది పక్క వీధి నారాయణది! శ్రేష్ఠి నా పీక మీద కూర్చున్నాడు! మర్యాదగా నగలపెట్టె ఇచ్చేయండి!" అన్నాడు.

"పొద్దున్నే తాగి వచ్చి, ఏమిటీ రచ్చ?" అన్నాడు రాజేశం నిబ్బరంగా.

"పిచ్చివాడేమో? తలుపు మూసేసి రండి!" అన్నది పార్వతమ్మ.

ఆ మనిషి రెచ్చిపోయి గొంతు హెచ్చించాడు. రాజేశం అతన్ని లక్ష్య పెట్టకుండా, "నువు చీకట్లో ఆ నగల పెట్టె ఎవరి ఇంట్లో ఇచ్చావో! మాకేమీ తెలియదు. శుభమా అని మా అమ్మాయి పెళ్లి పనులు ప్రారంభించబోతూ ఉంటే, తెల్ల

వారకుండగానే ఇదేం గొడవ!'' అన్నాడు. పార్వతమ్మ అతనికి వంత పలికింది.

''మీకు ఇక ఆ శ్రమ తప్పింది! ఈ పెళ్లి జరగదు,'' అంటూ స్తంభం చాటు నుంచి పెళ్ళికొడుకు తండ్రి ఇవతలకు వచ్చాడు.

అతన్ని చూసి భార్యాభర్తలు తెల్లబోయారు. ఆయన ఇలా అన్నాడు:

''మాకు కట్నం దమ్మిడీ కూడా అవసరం లేదు. మాకు కావలసినది కుటుంబగౌరవమూ, సంప్రదాయమూనూ! మీ గుణగణాలూ, నైజమూ తెలుసుకోవాలనే అంత కట్నం కోరి, గిల్టునగలతో నాటకం ఆడించాను. మీ అసలు బుద్ధి తెలిసిపోయింది. మీరు డబ్బు కోసం గడ్డి తినే రకం! మీ పిల్లకు మీ పోలికలే వస్తాయి. అటువంటి అమ్మాయిని మేం చేసుకోం.''

అకస్మాత్తుగా రాగిణి బయటనుంచి లోపలికి వచ్చి, ''ఆపండి! మీ వాదనకు అర్థం లేదు. తల్లిదండ్రుల ముక్కూ, ముఖమూ పిల్లలకు వస్తాయేమోగాని, బుద్ధులు రానవసరంలేదు. మా వాళ్ళు నిద్ర లేస్తే వీలుపడదని, చీకటితోనే లేచి, నగలపెట్టెను రక్షకభటులకు అప్పగించి వస్తున్నాను. మీ గిల్టు నగల పెట్టెను వారి నుంచి తీసుకోండి. ఈ పెళ్ళి జరగకపోతే మాకు జరిగే నష్టం ఏమీ లేదు,'' అంటూ గబగబా లోపలికి వెళ్లింది.

రాజేశమూ, పార్వతమ్మా నోరు మెదపలేకపోయారు. పెళ్ళికొడుకు తండ్రి తల వంచుకుని వెళ్లిపోయాడు.

ఆ సాయంత్రం రాగిణి మొక్కలకు నీరు పోస్తూండగా పెళ్ళికొడుకు అక్కడికి వచ్చి, ''మా నాన్న ఇలా నాటకం ఆడిన సంగతి నాకు తెలియదు. మీకు జరిగిన అవమానానికి క్షమాపణ చెప్పుకుందామని వచ్చాను. నువు క్షమించగలిగితే, నిన్ను పెళ్ళాడటానికి నేను ఇప్పుడు కూడా సిద్ధంగానే ఉన్నాను,'' అన్నాడు.

రాగిణి ఏమీ చెప్పకుండా, సిగ్గుతో తల వంచుకున్నది.





# నేర పరిశోధన

శ్రావస్తినగరాన్ని ప్రసేనజిత్తు పరిపాలించే కాలంలో దూర దేశం నుంచి ఒంటరిగాడైన బ్రాహ్మణు డొకడు వచ్చాడు. అదృష్ట వశాత్తూ నగరంలోని గొప్ప వైశ్యుల ప్రాపకం ఆ బ్రాహ్మణుడికి దొరికింది. నిత్యమూ ఆయనకు అన్నవస్త్రాలు పుష్కలంగా దొరకటమే గాక దానాలూ, దక్షిణలూ, సంభావనలూ దొరుకుతూండేవి. ఒంటరివాడు కావటంచేత ఆయన ఇలా దొరికిన సొమ్మును కొద్దికాలంలోనే వెయ్యి బంగారు దీనారాలుగా నిలవచేసి, దాన్ని మరొకవిధంగా భద్రపరచలేక, అడవిలో ఒకచోట పాతిపెట్టేశాడు.

భార్యాబిడ్డలూ, అన్నదమ్ములూ, బంధువులూ, ఎవరూ లేని ఆ బ్రాహ్మణుడి పంచప్రాణాలూ ఆ బంగారం మీదే ఉండేవి. రోజూ ఆయన అడవికి పోయి, తాను పాతిపెట్టిన ధనం ఎవరూ తవ్వుకుపోలేదు గదా అని చూసుకుని తిరిగి ఇంటికి వెళ్తుండేవాడు.

ఒకరోజు ఇలాగే ఆయన అడవికి పోయి చూసేసరికి అక్కడ బంగారం లేదు. అంతకుముందే దాని నెవరో తవ్వి తీసుకున్నారు. ఇది తెలుసుకుని బ్రాహ్మణుడు పిచ్చెత్తిపోయి, గుండెలు బాదుకుని ఏడుస్తూ నగరంలో వచ్చిపడ్డాడు. కనిపించిన వారికల్లా తనకు కలిగిన ఆపదను గురించి చెప్పుకున్నాడు. ఆయనను ఓదార్చటం ఎలాగో ఎవరికీ తెలియలేదు.

"నా డబ్బే పోయాక నేను జీవించటం మాత్రం దేనికి? నది దగ్గరకు వెళ్ళి అందులోపడి ఆత్మహత్య చేసుకుంటాను." అంటూ బ్రాహ్మణుడు నదికేసి పరిగెత్తాడు.

అప్పుడే నదిలో స్నానంచేసి తిరిగివచ్చే రాజు ప్రసేనజిత్తు ఆత్మహత్య చేసుకోబోయే బ్రాహ్మణుణ్ణి చూసి, విషయం

తెలుసుకుని, "ఎందుకయ్యా పిచ్చి బ్రాహ్మణుడా, ఆత్మహత్య చేసుకుంటావు? రాజ్యంలో దొంగతనం జరిగితే తెలుసుకునేటందుకు నేను లేనా? నీ సొత్తు అపహరించినవాణ్ణి పట్టుకుంటాను. లేదా, నీ సొమ్ము నా బొక్కసం నుంచి ఇప్పిస్తాను. డబ్బు పాతిపెట్టిన చోటుకు గుర్తులేమైనా ఉన్నాయా?" అని అడిగాడు.

"మహాప్రభూ, నేను ధనం పాతిపెట్టిన చోట అడవిబీరమొక్క ఒకటి గుర్తుండేది, ఇప్పుడదికూడా పోయింది." అన్నాడు బ్రాహ్మణుడు.

"అడవిబీరమొక్క ఎలా గుర్తవుతుంది. అవి ఎన్నయినా ఉండవచ్చు గదా?" అన్నాడు రాజు.

"లేదు, మహాప్రభూ! ఆ ప్రాంతంలో అదొక్కటే అడవిబీరమొక్క." అన్నాడు బ్రాహ్మణుడు.

"అయితే, నువ్వక్కడ సొమ్ము దాచిన సంగతి ఎవరెవరికి తెలుసు?" అని అడిగాడు రాజు.

"మహాప్రభూ, నాకు తప్ప మరొకరికి తెలీదు. నేనక్కడికి పోవటం ఎన్నడూ ఎవరూ చూసివుండలేదు." అన్నాడు బ్రాహ్మణుడు.

రాజు తన భవనానికి తిరిగివచ్చి ఈ దొంగతనం గురించి చాలా తీవ్రంగా ఆలోచించాడు. దొంగను పట్టుకునే ఉపాయం రాజుకు కొద్దిసేపట్లోనే స్ఫురించింది. ఆయన మంత్రిని పిలిపించి:



"మంత్రీ, నాకు ఆరోగ్యం సరిగాలేదు. వెంటనే వైద్యులను చూడటం మంచిదను కుంటున్నాను. నగరంలో ఉన్న వైద్యుల నందరినీ పిలిపించండి," అన్నాడు.

త్వరలోనే వైద్యులంతా వచ్చారు. రాజు ఒక్కొక్కరినే తన సన్నిధికి రప్పించి, "ఏమయ్యా, నువు నిన్నా, ఇవాళా ఏయే రోగాలకు ఔషధం ఇచ్చావు? ఏయే మూలికలు వాడావు?" అని ప్రశ్నించి, వారు చెప్పినదంతా విని పంపి వేయసాగాడు. అదంతా చూస్తున్న మంత్రికి రాజు అభిప్రాయం కొంచెమైనా అర్థం కాలేదు.

ఆఖరుకు ఒక వైద్యుడు, "మహాప్రభూ, మాతృదత్తు డనే వైశ్యశిఖామణికి అడవి బీరమొక్క రసం నిన్న వాడాను," అన్నాడు.

రాజు ఆసక్తితో, "అలాగా? ఆ మొక్క ఎక్కడ దొరికింది?" అన్నాడు.

"అడవిలో కష్టపడి వెతికి నా సేవకుడు పట్టుకొచ్చాడు, మహారాజా," అన్నాడు వైద్యుడు.

"అయితే ఆ సేవకుణ్ణి మా వద్దకు వెంటనే పంపించు," అన్నాడు రాజు.

వైద్యుడి సేవకుడు రాగానే రాజు, "ఒరే, నిన్న నువు అడవిబీరమొక్కను తవ్వినప్పుడు దాని కింద దొరికిన వెయ్యి దీనారాలూ ఏం చేశావు?" అన్నాడు.

సేవకుడు తెల్లబోయి, "మా యింట దాచాను, మహారాజా!" అన్నాడు.



''అవి ఫలాని బ్రాహ్మణుడివి. అతడికి వప్పగించు. వెళ్ళు.'' అన్నాడు రాజు.

చిత్తమంటూ సేవకుడు నమస్కరించి వెళ్ళిపోయాడు.

ఇదంతా పరికిస్తున్న మంత్రికి రాజే విధంగా ఆ బంగారం ఎత్తుకుపోయిన వాణ్ణి గుర్తించాడో అర్థంకాలేదు. రాజునే అడిగి ఆ రహస్యం తెలుసుకోదలిచాడు.

''మహారాజా. మీరీ దొంగతనాన్ని ఇంత సులువుగా ఎలా పట్టగలిగారో నా కర్థంకాలేదు.'' అన్నాడు మంత్రి.

రాజు నవ్వి ఇలా వివరించాడు :

''దొంగతనం గురించి బ్రాహ్మణుడు చెప్పినదంతా నిజమనే నమ్మకంతోటే నేను దొంగను పట్టటానికి ఆలోచించాను. నగరంలోని ఇన్ని లక్షలమందిలో ఒక్కడే ఆ దొంగతనం చేసి వుండాలి గద! అక్కడ ధనం ఉన్నసంగతి ఎవరికీ తెలియదని బ్రాహ్మణుడు చెబుతున్నాడు. ఆ ప్రత్యేక స్థలంలో ధనం ఉన్నదని తెలియకుండా అక్కడ తవ్వవలిసిన అవసరం ఎవరికి కలుగుతుంది? అడవిబీరమొక్కతో పని ఉన్నవాడికి.

''ఆ చుట్టుపక్కల ఎక్కడా అడవి బీరమొక్క లేదు. ఆ సంగతి బంగారం పోగొట్టుకున్న బ్రాహ్మణుడేచెబుతున్నాడు. అది నిజమేనని నాకు నమ్మకం కలిగింది. అదీగాక, ధనం కోసమే తవ్విన వాడెవడైనా అడవిబీరమొక్కను అక్కడే పారేసిపోతాడు. అడవిబీరమొక్క కోసం తవ్వినవాడైతేనే మొక్కనూ, ధనాన్నీ కూడా తన వెంట తీసుకుపోవటం జరుగుతుంది.

''అయితే అడవిబీరమొక్కతో ఎవరికి పని ఉంటుంది? వైద్యుడికి! అందుచేతనే వైద్యులందరినీ పిలిపించాను. అడవిబీరమొక్కతో వైద్యం చేసిన వైద్యుడు దొరకగానే దొంగ కూడా దొరికిపోయాడు. ఇందులో కష్టం ఏమిటి మంత్రీ?''

ఈ మాటలను విని ప్రసేనజిత్తు తెలివి తేటలకు మంత్రి చాలా సంతోషించాడు.





# ఇంద్రుడు

ఇంద్రుడు అనేవాడు వేదకాలంలో గాని, అంతకుపూర్వం గాని ఒక వ్యక్తి అయి ఉండవచ్చు. కాని కాలక్రమాన ఇంద్రత్వం ఒక పదవి అయింది. ఆ పదవిని నిర్వహించిన వారిలో సుశాంతుడూ, విభుడూ, మనోజవుడూ, త్వరలో భ్రష్టుడైపోయిన నహుషుడూ ఉన్నారు. నూరు క్రతువులు చేసినవారు ఇంద్రత్వానికి అర్హులట.

వేదకాలపు ఇంద్రుడికీ, పురాణకాలపు ఇంద్రుడికీ చాలా తేడాలు కనిపిస్తాయి.

వేదకాలపు భారతీయులకు ఇంద్రుడు సర్వోత్తముడైన ఆరాధ్యుడు. ఋగ్వేదంలో ఇంద్రుడి పరంగా 250 సూక్తా లున్నా యట. ఏ ఇతర దేవుణ్ణి గురించీ ఇన్ని సూక్తాలు లేవు. మరి 50 సూక్తాలలో పాక్షికంగా ఇంద్రుడి ప్రశస్తి ఉన్నది. ఇంద్ర శబ్దం ఆర్యులు ఇరాను నుంచి భారతదేశానికి రాకపూర్వమే ఉండినది. దీని వ్యుత్పత్తి తెలియదు. ఇతను ముఖ్యంగా వజ్రధారి, నగరాలను విధ్వంసం చేసిన పురందరుడు, దానవ వినాశకుడు, జలాలకు నిర్బంధం నుంచి విముక్తి కలిగించినవాడు, యుద్ధంలో అపజయం లేనివాడు.

వేదాలు ఇంద్రుడి అంగాంగ వర్ణన చేశాయి. అతనికి తలా, శరీరమూ, చేతులూ ఉన్నాయి. సోమపానం చేసే సందర్భంలో అతని బానకడుపు అనేక సార్లు వర్ణించబడింది. అతని పెదవులు ప్రత్యేకంగా వర్ణించబడ్డాయి (సుశిప్రుడు). అతని గడ్డం ఉద్రేకంలో గాని, కదలికలో గాని అమితంగా ఆడేదట. అతని కేశాలు కపిలవర్ణం గలవి. అతని శరీరమే కపిల వర్ణం (హరి వర్ణం). అతనిది బంగారు శరీరంగా కూడా అక్కడక్కడా చెప్పి



ఉన్నది. అతని చేతులు దీర్ఘమైనవి, బలిష్ఠమైనవి, సుందరమైనవి. అతను కామరూపి. చాలా అందమైన రూపాలు ధరించగలడు.

ఇంద్రుడికి ప్రత్యేకమైన వజ్రాయుధం త్వష్ట నుంచో, కావ్యఉశనుడు అనే వాడి నుంచో లభించింది. దాన్ని దేవతలు ఇచ్చారని ఐతరేయబ్రాహ్మణంలో ఉన్నది. వజ్రాయుధాన్ని రకరకాలుగా వర్ణించారు. అది లోహంతో చేసినది (అయసం), బంగారపుది, నాలుగు కోణాలు గలది, నూరు కోణాలు గలది, వెయ్యి మొనలు గలది, పదునైనది. అది రాతిది (అశ్మన్, పర్వత) అని కూడా అన్నారు.

ఇంద్రుడికి ధనుర్బాణాలు కూడా ఉండేవట. బాణాలు బంగారువి, నూరు మొనలు గలవి, వెయ్యి ఈకలతో కూడుకున్నవి. ఇవిగాక ఇంద్రుడు ఒక అంకుశాన్నీ, (అథర్వవేదంలో) ఒక వలనూ కూడా ఉపయోగించేవాడు.

ఇంద్రుడి రథం మనోవేగాన్ని మించిన వేగం గలది. "రథస్థుడు" అన్న మాట ఇంద్రుడి పట్ల ప్రత్యేకంగా ఉపయోగించబడింది. దాన్ని హరివర్ణం గల రెండు గుర్రాలు లాగేవి. (అక్కడక్కడా గుర్రాల సంఖ్య నూరూ, వెయ్యీ, పదకొండు వందలూ అని కూడా చెప్పబడింది.) ఇంద్రుడి రథాన్నీ, గుర్రాలనూ నిర్మించిన వారు ఋభులు.

సోమపానం దేవతలందరూ చేసేవారే గాని, ఇంద్రుడు పూర్తిగా సోమవ్యసనుడు. తాగటం కోసం అతను సోమాన్ని దొంగిలించాడని కూడా చెప్పబడింది. ఇంద్రుడి తరవాత చెప్పుకోదగిన తాగుబోతు వాయువు తప్ప, దేవతలలో గాని, మానవులలో గాని మరెవరూ లేరు. బాగా తాగినప్పుడు ఇంద్రుడు అసాధారణ శక్తిసామర్థ్యాలు ప్రదర్శించేవాడు. వృత్రుణ్ణి చంపటానికి ఇంద్రుడు మూడు "చెరువుల" సోమం తాగాడట! మరొక సందర్భంలో అతను ఒక్క గుక్కను 30 చెరు

వుల సోమం తాగాడని చెప్పి ఉన్నది. (ఈ చెరువు కొలత ఏమిటో ?)

తాగినప్పుడు తనకు ఏమనిపించేదీ ఇంద్రుడు స్వయంగా ఒక పూర్తి సూక్తంలో చెప్పుకున్నాడు. మామూలు మనుషుల లాగే తాగుడు మూలంగా జబ్బుపడితే అతని చికిత్స కోసం "సౌత్రామణి" అన్న యజ్ఞం చేయవలసి వచ్చింది. ఇంద్రుడు పాలలో తేనె కలిపి కూడా తాగేవాడు.

ఇంద్రుడు ఎద్దు మాంసమూ, గేదె మాంసమూ తినేవాడు. అతను 100 గేదెలనూ, మూడు వందల గేదెలనూ తిన్నట్టుగా కూడా ఋగ్వేదంలో చెప్పి ఉన్నది.

తాను తన పుటకను గురించి ఇంద్రుడు చెప్పుకున్నట్టు 3, 4 మండలాలలో ఋక్కులున్నాయి. అతను తన తల్లి డొక్కలో నుంచి అసహజంగా పుట్టాలని కోరుకున్నాడట. అతను పుట్టగానే ఆకాశం తేజోవంతమయింది. అతను పుట్టుతూనే సూర్యుడి చక్రాన్ని కదిలించాడు, యుద్ధం చేశాడు. అతనికి భయపడి భూమీ, కొండలూ కంపించాయి. దేవతలందరూ అతనికి భయపడ్డారు. అతని తల్లి ఆవు అని ఒక చోట చెప్పబడింది. అతను గోవుకు పుట్టిన కోడెదూడ (గార్ష్టేయ). అతని తల్లి పేరు నిష్టిగ్రి అని కూడా చెప్పబడింది. అదితి



అంటే ఈమే నని సాయణుడు అన్నాడు. అథర్వవేదంలో ఇంద్రుణ్ణీ, అగ్నినీ కన్న ఆమె పేరు ఏకాష్టక (ప్రజాపతి కుమార్తె) అని చెప్పబడింది. ఇంద్రాగ్నులకు తండ్రి ఒకడే.

ఇంద్రుడు తన తండ్రిని కాళ్లు పట్టుకుని చితకగొట్టి చంపాడు.

ఇంద్రుడి భార్య పేరు ఇంద్రాణిగా అనేకచోట్ల చెప్పబడింది. ఇంద్రుడికి ప్రాసహా, సేనా అనే భార్య లున్నట్టు ఐతరేయ బ్రాహ్మణంలో ఉన్నది. వేద సంహితలలోనూ, పురాణాలలోనూ కూడా శచియే ఇంద్రుడి భార్య అని కొందరు పండితుల అభిప్రాయం. విలిస్తేంగ అనే

అసుర (దానవ) స్త్రీని మోహించి, ఇంద్రుడు అసురుల మధ్య స్త్రీల వెంట స్త్రీ రూపంలోనూ, పురుషుల వెంట పురుషుల రూపంలోనూ జీవించినట్టు ఒక చోట చెప్పి ఉన్నది!

ఇంద్రుడికి సన్నిహితులూ, సహచరులూ మరుత్తులు. వీరు అతనికి అనేక సార్లు యుద్ధాలలో తోడ్పడ్డారు.

కొన్ని సందర్భాలలో ఇంద్రుడే సూర్యుడు అనే అభిప్రాయం కలుగుతుంది. ఒకప్పుడు తాను మనువు ననీ, సూర్యుడి ననీ ఇంద్రుడు అంటాడు.

ఇంద్రుడి గొప్పతనమూ, శక్తీ అపరిమితంగా చెప్పబడ్డాయి. అతనికి దీటయినవారు పుట్టలేదు, పుట్టబోరు. ఏ దేవతా అతన్ని మించలేదు, అతనితో సరికూడా కాలేదు. అతని పరాక్రమం అనన్యం. అతని ఆజ్ఞలను వరుణుడూ, సూర్యుడూ కూడా పాలించి తీరాలి. ప్రపంచానికంతకూ అతను అధిపతి. ''శక్రుడు,'' ''శచీవతుడు'' (శక్తివంతుడు) అనే పదాలు ఇంద్రుడి పట్లనే ఎక్కువసార్లు చెప్పబడ్డాయి. కొద్దిచోట్ల అతను ''అసురుడు''గా కూడా సంబోధించబడ్డాడు. (వేదకాలం ఆరంభదశలో అసురశబ్దం గౌరవవాచకమట! ఈ సంబోధన వరుణుడికీ, అగ్నికీ ఉండేది.)

సోమపానం చేసిన ఉత్సాహంలో, మరుద్గణాలను వెంటబెట్టుకుని ఇంద్రుడు వృత్రుణ్ణి ధ్వంసం చెయ్యటానికి పోతాడు. వృత్రుడు నీటికరువుకలిగించే రాక్షసుడు. వృత్రం అంటే కట్ట అనే అర్థం కూడా ఉన్నది. వృత్రుణ్ణి పాముగా కూడా చెబుతారు. అందుచేత ఇంద్రుడు నదుల ఆనకట్టలను ధ్వంసం చేసి, నదీజలాలను ''విడుదల'' చేసినట్టు ఊహిస్తున్నారు. ''జలాలకు అడ్డంగా ఉన్న'' వృత్రుణ్ణి ఇంద్రుడు వజ్రాయుధంతో వీపునా, ముఖానా కొట్టేసరికి నిర్బంధంలో ఉన్న జలాలు స్వేచ్ఛగా ప్రవహించాయట! వృత్రుడు ఇంద్రుడితో యుద్ధం చేసినట్టు కనిపించదు.





# అలెగ్జాండరు, పురురాజూ

క్రీస్తు పూర్వం 4 వ శతాబ్దిలో మాసిడోనియా రాజైన యువక అలెగ్జాండర్ ప్రపంచాన్ని జయిస్తానని బయలుదేరాడు. హిందూకుష్ పర్వత కనుమల కుండా అతను తన ప్రచండ సైన్యాన్ని పంజాబు, సింధు ప్రాంతాలకుతెచ్చాడు.

తక్షశిల రాజైన అంభి పురురాజుకు శత్రువు. అతను అలెగ్జాండర్ స్నేహం సంపాదించుకున్నాడు. పురు ఝీలమ్, చీనాబ్ నదుల మధ్య దేశానికి రాజు.





అంభి సహకారంతో అలెగ్జాండరు తన దేశం మీదికి యుద్ధానికి వస్తున్నాడని తెలిసి పురు యుద్ధసన్నద్ధుడయాడు.



ఆనాడు వితస్తా అని పేరుగల ఝీలమ్ నది రెండు పక్కలా ఉభయ సేనలూ తారసపడ్డాయి.

అలెగ్జాండర్ ఒక యుక్తి పన్నాడు. అతను తన సేనలలో అత్యధిక భాగాన్ని అనేకమైళ్లు దూరంగా నదిని దాటించి, పురురాజు శిబిరంపై దాడిచేశాడు.





అలెగ్జాండర్ పురు సైన్యంలోని ఏను గుల జోలికి పోక, కాల్బలాలను వెనుక నుంచి దెబ్బతీశాడు. అలా జరుగు తుందని ఊహించక పోయినప్పటికీ, పురురాజు తన శిబిరాన్ని వీరోచితంగా రక్షించుకునే ప్రయత్నం చేశాడు.

పోరు ఘోరంగా సాగింది. ఏనుగు బలాలతో ఎలా యుద్ధం సాగించాలో అలెగ్జాండర్‌కు అంభి చెప్పాడు. అయినా అలెగ్జాండర్ పురుసేనల ధైర్యసాహసాలకు అచ్చెరు వొందాడు.





పురురాజు తన సేనలకు తానే నాయకుడు. అతను అనేక మార్లు గాయపడ్డాడు. అయినా అతను వెనుదీయలేదు. అతని కొద్ది సేన పెద్దదైన గ్రీకు సేనతో దీర్ఘ పోరాటం జరిపింది.

పురును పోరాటం చాలించమని అతని హితులు చెప్పారు, కాని వినిపించుకోక, యుద్ధం సాగించాడు: అతని అంగ రక్షకులు ఒకరొకరే పడిపోయారు. అయినా అతను యుద్ధం చేస్తూండటం అలెగ్జాండర్ గమనించాడు.





అలెగ్జాండర్ సేనానులు పురును చుట్టుముట్టి పట్టుకునే సమయానికి అతని శరీరం మీద తొమ్మిదిగాయాలున్నాయి. చివరిదాకా అతను పోరాడుతూ, తనను పట్టినవారిలో ఒకణ్ణి చంపాడు.

పెడరెక్కలు విరిచి కట్టి పురురాజును అలెగ్జాండర్ ముందు నిలబెట్టారు. "నా నుంచి నువు ఏం ఆశిస్తున్నావు?" అని అలెగ్జాండర్ అతన్ని అడిగాడు. "ఒక రాజు మరొక రాజుకు చూపదగిన మర్యాద!" అన్నాడు పురు.





అలెగ్జాండర్ అంతకు మించిన ధైర్యశాలిని చూసి ఎరగడు. వివశుడైపోయి, అతను పురురాజును విడిచిపెట్టి, అతని స్నేహం కోరాడు. పురురాజు స్వతంత్రుడుగా పరిపాలన సాగించాడు.



# కట్నంలేనిపెళ్లి

కాంతమ్మ డబ్బుగలదె గాని చాలా కటిక మనిషి. నోటి దురుసు. భర్త లేడు. ఒకే ఒక్క కొడుకు రాముడు తల్లి స్వభావానికి పూర్తిగా వ్యతిరేకి. అందగాడు కూడా. అయితే ఏ విషయంలోనూ తల్లికి ఎదురు చెప్పే ధైర్యం లేదు. రాముడంటే ముచ్చటవేసి, గ్రామంలో చాలామంది అతనికి పిల్ల నిస్తామని వచ్చారు. పాతిక వేలు కట్నం అడిగింది కాంతమ్మ. అంత ఎత్తు తూగలేనివాళ్ళు తాము విరమించుకోవటంతో సరిపెట్టుకోక, పొరుగూరు నుంచి వచ్చే సంబంధాలను ఊళ్ళోకి అడుగు పెట్టకుండా కాంతమ్మ మీద దుష్ప్రచారం చేసి పగతీర్చుకున్నారు.

అనుమానం వచ్చి కాంతమ్మ, "ఒరే రాముడూ, ఈ మధ్య ఒక్క సంబంధమూ రావటంలేదు. ఊళ్ళోవాళ్ళు చెడగొట్టుతున్నారేమోరా!" అన్నది.

రాముడు ధైర్యంచేసి, "అంత కట్నం అడిగితే ఊళ్ళోవాళ్ళు శత్రువులు అయారేమో? అంతా ఏకమైతే మన పని ఏంగాను?" అన్నాడు.

కాంతమ్మ ఆలోచనలోపడి, "అలాగైతే, ఈసారి వచ్చినవాళ్ళను ఒక్క పైసా కట్నం అడగను. అసలు కట్నం అక్కర్లేదని చెబుతాను," అన్నది.

రాముడు చాలా సంతోషించాడు.

పొరుగు గ్రామంలో కుటుంబయ్యకు ఆరుగురు ఆడ సంతానం. అందరిలోకీ ఆఖరుది సీత చక్కనిచుక్క. పై అయిదుగురు కూతుళ్ళకూ పెళ్ళిళ్ళు చేసి ఒక్క పైసా కూడా కట్నం ఇచ్చుకోలేని స్థితిలో ఉన్నాడు కుటుంబయ్య. సీత చక్కదనం చూసి ఎవరో ఒకరు కట్నం లేకుండా చేసుకోకపోతారా అని అతని ఆశ! కాని ఆ ఆశ తీరేలా కనిపించలేదు. కట్నం

బంధకవి సరోజినీదేవి



బంగారునగలు చేయించి పెట్టాలి,'' అన్నది కాంతమ్మ.

మొదటి మాటకు వికసించిన కుటుంబయ్య ముఖం రెండో మాటతో మాడిన పెంకులా అయింది. రాముడు ఉలిక్కి పడి, ''కట్నం సొమ్ము ఇలా రాబట్టాలని చూస్తున్నదన్న మాట!'' అనుకున్నాడు.

''అమ్మా, నేను పేదవాణ్ణి! అంత బంగారం తేలేను, తల్లీ!'' అన్నాడు కుటుంబయ్య.

''బంగారం తెచ్చి నా ఒళ్లో పొయ్యమన్నానా? పిల్ల ఒంటినే గదా ఉండేది? ఆలోచించుకోండి,'' అంటూ కాంతమ్మ, కొడుకును లేపుకుని, బయటికి నడిచింది.

ఇక సీత తనకు దక్కదని నిరాశ చేసుకుని, తల్లిని తిట్టుకుంటూ ఆమె వెంట నడిచాడు రాముడు.

జరిగిన సంగతి తెలిసి సీత అక్కలు, తమ నగలన్నీ సీతకు పెట్టి పెళ్ళి చేసేసి, తరవాత కాంతమ్మకు ఎలాగో సర్ది చెప్ప వచ్చునని తండ్రికి సలహా ఇచ్చారు.

''మీరు కోరిన ప్రకారం పిల్లకు బంగారం పెట్టుతాను,'' అని కుటుంబయ్య కాంతమ్మకు కబురు చేశాడు.

అందమైన కోడలు వంటెడు బంగారంతో వస్తున్నందుకు కాంతమ్మ మురిసి పోయింది.

రాదని తెలియగానే, వచ్చిన సంబంధాలు కొన్ని వెనక్కు తగ్గాయి.

సీత పెళ్ళి ఎలాగా అని దిగులు పడుతున్న కుటుంబయ్యకు కాంతమ్మ కొడుకు సంబంధం గురించి తెలిసింది. అతను కాంతమ్మనూ, కొడుకునూ పెళ్ళి చూపులకు ఆహ్వానించాడు. ఇద్దరూ వచ్చి, పిల్లను చూశారు. రాముడికి సీత బాగా నచ్చి, ఆ పిల్ల తనకు దక్కితే అదే పది వేలు అనుకున్నాడు. కాంతమ్మకు ఇల్లు నచ్చలేదు. బోసిగా ఉన్నది. సీత తల్లి మెడలో పసుపుతాడు తప్ప ఇంకేమీ లేదు.

''కట్నం అక్కర్లేదు!'' అని కొంచెం సేపు ఆగి, ''మీరు పిల్లకు పాతికాకాసుల



పెళ్ళి జరిగిపోయింది. వంటి నిండా నగలతో సీత అత్తవారింటికి వెళ్ళి పోయింది. తన నగల రహస్యాన్ని ఆమె తన భర్తకు చెప్పటానికి భయపడింది.

నగలు లేకుండా తిరిగి వెళితే తమ భర్తలు కోపగిస్తారు. అందుచేత సీత అక్కలు తమ చెల్లెలు ఎప్పుడు పుట్టింటికి వస్తుందా అని ఆత్రంగా ఎదురు చూస్తు న్నారు. కాని కాంతమ్మ సీతను పుట్టింటికి పంపలేదు. సీతకు నెల తప్పింది. కోడలిని ఏకంగా పురిటికి పంపుతానని కాంతమ్మ వియ్యంకుడికి కబురు పంపింది.

నెలలు నిండిన సీత పుట్టింటికి ప్రయాణమయేటప్పుడు, ''రోజులు బాగా లేవు. దొంగతనాలు జాస్తిగా ఉన్నాయి. నీ నగలు ఇనప్పెట్టెలో భద్రంగా ఉంచు తాను,'' అన్నది కాంతమ్మ.

సీత కొయ్యబారి పోయింది. తమ నగల కోసం వచ్చిన అక్కలు సీతను పసుపుతాడుతో చూసి, ''ఈసారి కూడా నగలు లేకుండా వెళితే మా భర్తలు ఇంట్లో అడుగుపెట్టనియ్యరు,'' అని లబ లబలాడారు.

సీత వెనకనే రెక్కలు కట్టుకుని వచ్చిన అల్లుడి చేతులు పట్టుకుని ప్రాధేయ పడుతూ ఉన్న సంగతి చెప్పేశాడు కుటుంబయ్య.

''మీ ఇనప్పెట్టెలో ఉన్న నగలు తెచ్చి మా అక్కలకు ఇయ్యకపోతే వాళ్ల కాపరాలు కూలిపోతాయి!'' అని సీత తన భర్తతో అన్నది.

రాముడు నివ్వెరపోయాడు. జరిగిన సంగతి తల్లికి తెలిస్తే తనకు సీతతో కాపరం చేసే ప్రాప్తి ఉండదు. అతను ఒక నిర్ణయానికి వచ్చి, ''నగలు తెచ్చి ఇచ్చే పూచీ నాది,'' అని సీతకు మాట ఇచ్చాడు. అతను తన గ్రామానికి తిరిగి వెళ్ళాడు.

ఒకనాడు అతను తల్లితో, ''అమ్మా, సీతను గురించి పీడకల వచ్చింది. ఒకసారి చూసి వస్తాను. ప్రసవసమయం కదా!

మర్నాటికల్లా వచ్చేస్తాను.'' అని చెప్పి ఇంటి నుంచి బయలుదేరాడు.

మర్నాడు రాత్రి చీకటిపడగానే, తన కొడుకు రాడని నిర్ధారణ చేసుకుని, తలుపు మూసి కాంతమ్మ పడుకున్నది.

కొంచెం పొద్దుపోయినాక తలుపు తట్టిన చప్పుడయింది. కొడుకు వచ్చాడనుకుని కాంతమ్మ వెళ్ళి తలుపు తీసింది.

ఒక ముసుగుదొంగ చటుక్కున లోపల జొరబడి, ఒక చేత్తో కాంతమ్మ నోరు మూసి, రెండో చేత్తో కత్తి చూపించి, ''నోరు తెరిచావా, జాగ్రత్త! ఇనప్పెట్టె తాళాలెక్కడ?'' అని గద్దించాడు.

కాంతమ్మ గడగడలాడుతూ తాళాలిచ్చింది. దొంగ కాంతమ్మ కాళ్ళూ, చేతులూ కట్టేసి, ఇనప్పెట్టె తెరిచి, నగలు తీసుకుని పారిపోయాడు.

మరికొంతసేపటికి, ''తలుపు వేసుకోలేదా, అమ్మా?'' అంటూ లోపలికి వచ్చిన రాముడు తల్లిని చూసి లబలబలాడుతూ ఆమె కట్లు విప్పాడు.

''తలుపు చప్పుడయితే నువ్వేమోనని తలుపు తీశానురా, నాయనా! దొంగ వచ్చినాడు కత్తి చూపించి, ఇనప్పెట్టె అంతా దోచుకుపోయాడు! నన్ను కట్టి పడేశాడు!'' అని కాంతమ్మ వాపోయింది.

''రోజులు మంచివికావు. ఎవరో తెలియకుండా తలుపు తీస్తారా?'' అంటూ రాముడు ఇనప్పెట్టె సొరుగులన్నీ గాలించి, ''ఇంకానయం, నీ నగలు పోలేదు. సీతవే పోయాయి! సీత నగలు పెట్టుకుని పుట్టింటికి వెళ్ళినా బాగుండేది! సీత నగలు మాత్రమే పోయాయంటే ఎవరూ నమ్మరేమో!'' అన్నాడు చింతిస్తూ.

''మనమేనా అంత చేతగానివాళ్ళం? రేపీపాటికి సీతకు నగలన్నీ చేయిస్తాను. అవి దొంగలు ఎత్తుకు పోయినట్టు ఎవరికీ తెలియనవసరం లేదు!'' అన్నది కాంతమ్మ పౌరుషంగా.

సీత కొడుకును కన్నది. బారసాల నాడు అత్తగారు కోడలు వంటినిండా బంగారం నగలు దిగవేసింది.



# మూఢ నమ్మకం

కృష్ణయ్య ధనవంతుడూ, విద్యావంతుడూ. అయితే అనేకమంది లాగ అతనికి, శుక్రవారం నాడు డబ్బు ఖర్చుచేస్తే, లక్ష్మి నిలవదన్న మూఢనమ్మకం ఉండేది. అతని భార్యకూ అదే నమ్మకం. ఒకసారి కృష్ణయ్యకు జబ్బు చేసింది. రామశాస్త్రి వైద్యం పని చెయ్యలేదు.

"అయ్యా, ఇది ప్రమాదకరమైన విషజ్వరం. మీరు ఇవాళే బయలుదేరి పట్నం పోయి, మంచి వైద్యం చేయించుకోండి. అలస్యం ప్రమాదకరం," అన్నాడు రామశాస్త్రి.

"ఇవాళ శుక్రవారం! డబ్బు ఖర్చు ఎలా చేస్తామండీ?" అన్నారు కృష్ణయ్యా, అతని భార్యా.

రామశాస్త్రి వాళ్ళ మౌఢ్యానికి మండిపడి, "నేను చేసిన వైద్యానికి ఈ క్షణం డబ్బు చెల్లించండి. లేకపోతే మీ పరువు నిలవదు," అన్నాడు.

గత్యంతరం లేక కృష్ణయ్యా, భార్యా రామశాస్త్రికి డబ్బు ఇచ్చి, వ్రతభంగం కానే అయింది గదా అని ఆ రోజే పట్నంవెళ్ళి, వైద్యం చేయించుకున్నారు. కృష్ణయ్య బతికి బయట పడ్డాడు.

కృష్ణయ్య ప్రాణం కాపాడానన్న తృప్తి రామశాస్త్రికి దక్కింది. —కె. శరత్‌చంద్రరెడ్డి





# పెండ్లామా? పిశాచమా?

కొత్తగా కాపరానికి వచ్చిన నూకరాజు భార్య పట్టి సోమరి. నూకరాజే ఉదయంతో లేచి, పాలికాపు తెచ్చిన పాలు భద్రం చెయ్యడమూ, నూతినీళ్ళు తోడడమూ వగైరా పనులన్నీ చేసేవాడు. అతను చద్ది పెట్టుకు తిని, పొలానికి బయలుదేర బోతూండగా పార్వతి నిద్రమంచం నుంచి లేచేది. మళ్ళీ రాజు పొలం పనులు చూసుకుని, ఎండలోపడి ఇంటికి వచ్చేలోపున ఆమె వంట చేసి, తాను తిని, మిగిలినది మూతలుపెట్టి, పడుకునేది. నూకరాజు తానే అన్నం పెట్టుకు తిని, కొంచెంసేపు విశ్రాంతి తీసుకుని, పొద్దువాలుతూండగా మళ్ళీ పొలానికి వెళ్ళేవాడు. రాత్రికి అతను పొలం నుంచి తిరిగి వచ్చేలోపుగా పార్వతి తన భోజనం ముగించుకుని, పొరుగు అమ్మలక్కలతో కబుర్లు చెప్పటానికి పోయేది.

తల్లీ, తండ్రీ, దగ్గిర బంధువులూ లేని నూకరాజు, పార్వతి అందంగా ఉన్నదనీ, తల్లిదండ్రులకు ఒక్కతే కూతురనీ చూసి చేసుకున్నాడు. అందుచేత అతను ఆమెను ఏమీ అనలేకపోయేవాడు. అతని అత్తవారి ఊరయిన పేరాపురానికి అయిదు రోజుల కాలినడక! అన్నప్పుడల్లా వచ్చిపోయే వీలులేదు.

కొన్నాళ్ళు గడిచాక, తమ కూతురిని పంపమని పార్వతి తల్లిదండ్రులు కబురు పెట్టారు. నూకరాజు ఆమెను పుట్టింట దిగవిడిచి వచ్చాడు. ప్రయాణానికే పది రోజులు పోగా, మామగారి వత్తిడి వల్ల అత్తవారింట మూడురోజులు ఉండిపోవలసి వచ్చింది. నూకరాజు తిరిగి వచ్చేసరికి పనులన్నీ అస్తవ్యస్తం అయిపోయాయి. వాటిని దారిలోకి తెచ్చుకోవటానికి వారంరోజులు పట్టింది.

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

తరవాత పదిరోజులకు, నూకరాజు ఏదో పని మీద పొరుగూరు వెళ్ళి తిరిగి వస్తూండగా, దారిలో పార్వతి కొత్త పెట్టెతో నడిచి వస్తూ కనిపించింది.

"నువు ఒకతెవే వస్తున్నావేం? నిన్ను దిగబెట్టడానికి ఎవరూ లేకపోతే నాకు కబురుపెట్టకపోయావా?" అని నూకరాజు తన భార్యను అడిగాడు.

"నిన్ను వదిలి ఉండలేకపోయాను. పక్క ఊరిదాకా ఎవరో వస్తూంటే, వాళ్ళ వెంట బయలుదేరి వచ్చేశాను. వాళ్ళు దిగబడి పోయేటప్పుడు, దగ్గరే గదా, మరేమీ భయంలేదులెమ్మని వాళ్ళతో చెప్పి, ఇలా వస్తున్నాను," అన్నది పార్వతి.



ఆనందంగా కబుర్లు చెప్పుకుంటూ ఇద్దరూ ఇల్లు చేరుకున్నారు.

పార్వతి చక్కగా వంట చేసి పెట్టింది. ఆమె వంట అంత రుచిగా ఉన్నట్టు నూకరాజుకు లోగడ ఎన్నడూ అనిపించ లేదు. అతనికి ఆశ్చర్యమూ, ఆనందమూ కూడా కలిగాయి.

మర్నాడు ఉదయం నూకరాజు లేచే సరికి, ఇల్లు శుభ్రంగా ఉన్నది. పాలెకాపు తెచ్చిన పాలు భద్రపరచి ఉన్నాయి. నూకరాజు పొలానికి పోయేముందు చద్దిఅన్నం తింటూంటే, పార్వతి పక్కనే కూర్చుని, సరదాగా కబుర్లు చెప్పింది.

పార్వతిలో కలిగిన ఈ మార్పుకు నూకరాజు ఉప్పొంగిపోయాడు. భర్తకు రకరకాల వంటకాలు చేసి పెట్టుతూ, అస్తమానమూ అతనికి చేదోడూ, వాదోడూగా పార్వతి ఉండడంతో, వారం రోజులు ఆనందోత్సాహాలతో గడిచి పోయాయి నూకరాజుకు.

ఒకనాటి అర్ధరాత్రి నూకరాజుకు ఎందుకో మెలుకువ వచ్చింది. భార్య పడుకునే మంచం కేసి చూస్తే అది ఖాళీగా ఉన్నది. అతను తన మంచం మీది నుంచి కిటికీలో నుండా పెరట్లోకి చూశాడు. పిండారబోసినట్టున్న వెన్నెలలో పార్వతి స్పష్టంగా కనిపిస్తున్నది. కాని నూకరాజు



తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. పార్వతి నిలబడి చేతులు ఆడిస్తూంటే, బొక్కెన దానంతట అదే బావిలోకి దిగి, నీరుతో పైకి వచ్చి, తొట్టెలు నింపుతున్నది! తొట్టెలు నిండగానే, చీపురు దానంతట అదే దొడ్డి ఊడవడం ఆరంభించింది!

భయంతో నూకరాజు ఒళ్ళు చల్లబడిపోయింది. పార్వతి పాచిపనులన్నీ ముగించుకుని లోపలికి వచ్చేలోగా, అతను తిరిగి వచ్చి పడుకుని, నిద్రపోతున్నట్టు నటించాడు. అర్ధరాత్రే పాచిపనులన్నీ ముగించుకు వచ్చిన పార్వతి నూకరాజు ముఖంలోకి పరీక్షగా చూసి, తృప్తిపడి, తన మంచం మీద తాను పడుకున్నది.

పొలం నుంచి వచ్చాక ఎవరైనా భూత వైద్యుణ్ణి సంప్రతించాలని నూకరాజు నిశ్చయించుకున్నాడు. అతను పొలానికి పోతూ ఉండగా, మళ్ళ గట్ల మీదుగా అడ్డంపడి, పేరాపురం నుంచి వస్తున్న అతని మామగారు శరభన్న ఎదురయాడు.

"ఏమిటి ఇలా వస్తున్నారు? అత్త క్షేమమేనా? ఇలా వస్తున్నట్టు తెలిపారైనా కారేం? మిమ్మల్ని చూసి పార్వతి ఆశ్చర్యపోతుంది!" అన్నాడు నూకరాజు శరభన్నతో.

"పార్వతి ఆశ్చర్యపోతుందా? నూకరాజూ, నీ మాటలు నాకు అర్థంకావడం లేదు," అన్నాడు శరభన్న అయోమయంగా.

"ముందు ఇంటికి రండి. అన్నీ తరవాత మాట్లాడుకోవచ్చు." అంటూ నూకరాజు తన మామను వెంట బెట్టుకు ఇంటికి తిరిగి వచ్చాడు.

అతను తలుపు తట్టగానే పార్వతి తలుపు తెరిచింది.

ఆమెను చూస్తూనే శరభన్న, "అమ్మా! పార్వతీ!" అని కేకపెట్టి, అక్కడే మొహం తిరిగి పడిపోయాడు.

అతను పెట్టిన కేకకు నలుగురూ పోగయారు.

ముఖాన నీళ్లు చల్లిన మీదట శరభన్న తేరుకుని, "అమ్మా, పార్వతీ! నువు

అన్నమాట నిలబెట్టుకున్నావా?''
అన్నాడు.

ఆ మాటలు ఎవరికీ అర్థం కాలేదు.

''నా పార్వతి! నా తల్లి చచ్చిపోయిందనుకున్నాను. ముందు దాన్ని చూడాలి!'' అంటూ శరభన్న లోపలికి వచ్చాడు. అతనితో బాటు అందరూ వచ్చారు.

పార్వతి మంచం మీద స్పృహలేకుండా పడి ఉన్నది. ఎవరో ముఖాన నీళ్లు చల్లినాక ఆమెకు స్పృహవచ్చి, చుట్టూ మూగిన జనాన్ని చూస్తూ, బిత్తరపోయినట్టుగా, "నేనిక్కడికి ఎలా వచ్చానూ?" అని అడిగింది.

''నేనమ్మా! నాన్నని!'' అన్నాడు శరభన్న.

పార్వతి నూకరాజును చూసి, ''ఏమిటండీ ఇదంతా? నాకంతా అయోమయంగా ఉన్నది,'' అన్నది.

నూకరాజుకు కూడా యిదంతా అయోమయంగానే ఉండడం వల్ల అతను తెల్లమొహం వేశాడు. శరభన్న ఇలా అన్నాడు:

''నూకరాజూ, పార్వతీ! మీరేమీ కంగారుపడకండి! అసలు విషయం నేను చెబుతాను. నువు పార్వతిని దిగబెట్టి వెళ్లిన రెండురోజుల తరవాత నేనూ, మీ అత్తా, పార్వతీ పొరుగూరు సంతకు వెళ్ళాం. మేం తిరిగి వచ్చేటప్పుడు పార్వతి హాస్యధోరణిలో చెబుతున్న మాటలనుబట్టి, అది నిన్ను సుఖపెట్టడం



లేదని మాకు అర్థమయింది. దాని ప్రవర్తనను ఖండిస్తూ, నేనూ, మీ అత్తా దానికి హితబోధ చేస్తూ, ఊరి బయట శ్మశానం వద్దకు చేరాం. అకస్మాత్తుగా పార్వతి మరోమనిషిలా అయిపోయినట్టు కనిపిస్తూ, 'నా భర్తను నేను తప్పకుండా సుఖపెడతాను, నాన్నా!' అన్నది గంభీరంగా. 'నీ గొంతు అలామారిందేమ్మా?' అని అడిగితే, 'నేను పూర్తిగా మారిపోయాను, నాన్నా!' అన్నది. దాన్ని చూస్తూంటే ఏదో గాలిచేష్టలా తోచింది. దానికి తెలియకుండా ఏవో భస్మాలూ, రక్షరేకులూ వాడాం. ఇంతలో ఉన్నట్టుండి పార్వతి మాయం అయింది. మా వూరి పక్కన నది ఒడ్డున ఎవరికో పార్వతి బట్టలు దొరికాయి. అది నదిలోపడి చచ్చిపోయిందని ఏడ్చాం. ఈ దుర్వార్త నీకు చెప్పటానికి ఇన్నాళ్ళూ అనుమానించి, చివరకు బయలుదేరాను.''

''ఇదంతా నిజమా, నాన్నా?'' అని పార్వతి ఆశ్చర్యంగా అడిగింది.

దానికి సమాధానంగా నూకరాజు, ''నిజమే, నాకూ నిన్న అసలు విషయం తెలిసింది. అది నిజమో కాదో నిరూపించుకుందా మనుకుంటూండగా మీ నాన్న కనిపించాడు. మీ నాన్నను చూడగానే నిన్ను పట్టిన కామినీపిశాచం వదిలి ఉంటుంది. ఆ పిశాచం భర్తను సుఖపెడతానన్న మాట చెల్లించుకునేందుకు వచ్చేసింది. మీ అమ్మా, నాన్నా గాలిచేష్ట అని తెలుసుకోవడం వల్ల వాళ్ళతో చెప్పకుండా వచ్చేసింది. నువు చచ్చిపోయినట్టు అపోహ కలిగించటానికి నీ బట్టలు నీటి దగ్గిర పెట్టింది దాని ఉద్దేశం శాశ్వతంగా నీ వెంట ఉండి పోదామనే!'' అన్నాడు.

తరవాత అతను పార్వతితో ఏకాంతంగా, ''నీకన్న ఆ పిశాచే నయం! నన్ను ఎంతో బాగా చూసుకున్నది!'' అంటూ జరిగినదంతా ఆమెకు చెప్పాడు.

తరవాత పార్వతి ఆ పిశాచం కన్న కూడా బాగా భర్తను చూసుకునేటందుకు విశ్వప్రయత్నం చేసింది!






# పద్మావతి

సింహళదేశానికి రాజైన బృహద్బృతు డనే వాడికి పద్మావతి అని కూతురు ఉండేది. ఆమె పసితనం నుంచీ శివుణ్ణి ఆరాధించేది.

ఒకసారి శివుడు ఆమెకు కనిపించి, "నీకు విష్ణుమూర్తి అంశగలవాడు భర్త అవుతాడు. ఇతరులు ఎవరైనా నిన్ను పెళ్ళాడగోరి వస్తే, వాళ్ళు వెంటనే స్త్రీలు అయిపోతారు," అని చెప్పాడు.

పద్మావతి ఈసంగతి ఎవరికీ చెప్పలేదు.

కాలం గడిచింది. పద్మావతి యుక్త వయస్కురాలయింది. ఆమె తండ్రి ఆమెకు స్వయంవరం ఏర్పాటు చేశాడు.

అనేక దేశాల రాజులు పద్మావతిని పెళ్ళాడగోరి, స్వయంవరానికి వచ్చారు. కాని పద్మావతి వారి మధ్యకు రాగానే, వారు స్త్రీలుగా మారిపోయారు.

శివుడు ఆమెకు చెప్పినమాట సగం నిజమయింది. కాని పూర్తిగా నిజం కాలేదు. ఆమెకు భర్త కాదగినవాడు స్వయంవరానికి వచ్చిన రాజులలో ఎవడూ లేడు!

పద్మావతి తండ్రి ఇలా రెండుమూడు సార్లు తన కుమార్తెకు స్వయంవరం ఏర్పాటు చెయ్యటమూ, దానికి వచ్చిన రాజులు ఆమెను చూస్తూనే స్త్రీలుగా మారిపోవటమూ జరిగింది.

తన కిక పెళ్ళికాదని పద్మావతికి మనోవ్యాధి పట్టుకున్నది. ఆమె ఒకనాడు ఉద్యానవనంలో కూర్చుని ఉండగా, ఒక చిలుక ఎక్కడి నుంచో వచ్చి, మనిషి భాషలో, "అమ్మా, ఎందుకు విచార పడతావు? నీకు భర్త కాదగినవాడు మన్మథాకారుడున్నాడు. అతన్ని నీ దగ్గిరికి తెస్తాను," అన్నది.

పద్మావతి మనసులో ఆశ చిగురించింది. శివుడు తనతో అన్న మాటలలో

కారుమంచి మాధవరావు

మిగిలిన సగం కూడా నిజం కాబోతున్న దని ఆమెకు నమ్మకం కుదిరింది.

ఈ చిలుక ఎవరు?

శంబళపురంలో విష్ణుయశుడూ, సుమతీ అనే దంపతులు ఉండేవారు. వారికి కల్కి అనే కొడుకు కలిగాడు. ఇతను పరశురాముడి వద్ద విద్యలు నేర్చుకున్నాడు; పద్మావతి లాగే శివభక్తుడు.

ఇతని భక్తికి మెచ్చి శివుడు ప్రత్యక్షమై, కల్కికి ఒక ఖడ్గాన్నీ, ఒక గుర్రాన్నీ, ఒక చిలుకనూ ప్రసాదించాడు.

ఈ చిలుకే యాదృచ్ఛికంగా సింహళానికి వెళ్ళి, పద్మావతి స్వయంవరం ఎలా అభాసుపాలయినదీ తెలుసుకుని, ఆమెకు కల్కిని గురించి చెప్పి, కల్కి వద్దకు తిరిగి వచ్చి, "సింహళరాజు కూతురు పద్మావతి అని ఉన్నది. అంత కన్న చక్కని భార్య నీకు దొరకబోదు," అని చెప్పి, నమ్మించింది.

కల్కి పద్మావతిని చూడకుండానే ఆమె మీద మోహం నిలిపాడు. ఆ కారణంగా అతను సింహళానికి బయలుదేరి వెళ్ళి, ఉద్యానవనంలో స్నానం చెయ్యటానికి వచ్చిన పద్మావతిని కలుసుకున్నాడు.

పద్మావతి అంతకు ముందే అతన్ని గురించి చిలుక ద్వారా విని ఉన్నది గనకనూ, తనను చూసి ఇతను స్త్రీగా మారలేదు గనకనూ, ఇతనే తనకు విధి నిర్ణయించిన భర్త అని గ్రహించి అతన్ని పెళ్ళాడతానని తన తండ్రితో చెప్పింది.

రాజుకు అంతకన్న కావలసినదేమున్నదీ? పద్మావతికీ, కల్కికీ వైభవంగా పెళ్ళి అయింది. ఆ శుభ సమయంలో స్త్రీలుగా మారి ఉండిన రాజకుమారులందరూ కల్కిని తమకు యథారూపాలిప్పించమని వేడుకున్నారు. రేవానదిలో స్నానం చెయ్యమని కల్కి వారికి చెప్పాడు. వారు అలాగే చేసి, తిరిగి పురుషులయారు.

కల్కి కలిని నిర్మూలించటానికి పుట్టిన విష్ణువు అవతారమే.





# దేవీ భాగవతం



హైహయ వంశంలో పుట్టిన ప్రఖ్యాతుడు కార్తవీర్యుడు సాటిలేని శౌర్యపరాక్రమాలు గలవాడు, వెయ్యి చేతులవాడు, అంతులేని యజ్ఞాలు చేసి, చేతికి ఎముకలేకుండా దానాలూ, దక్షిణలూ ఇచ్చాడు. అతని గురువు దత్తాత్రేయుడు. అతని పురోహితులు భృగువులు. అందుచేత కార్తవీర్యుడు చేసిన యజ్ఞాలలో దక్షిణలు పుచ్చుకుని భృగులు అపార ధనవంతులయారు.

కార్తవీర్యుడు చనిపోయినాక అతని సంతతికి చెందిన హైహయులు దరిద్రులైపోయి, తమ గురువులైన భృగులను యాచించారు. కాని భృగులు హైహయులకు తమ ధనం ఇయ్యటం ఇష్టంలేక అక్కడా, అక్కడా పాతిపెట్టి, రాజుల భయంతో కొండగుహలకు పారిపోయి, దాక్కున్నారు.

హైహయులు వచ్చి వెతికితే బ్రాహ్మణుల ఇళ్లన్నీ నిర్జనంగా ఉన్నాయి. వాళ్ల ఇళ్లు తవ్వితే అంతులేని ధనం బయటపడింది. కోపం పట్టలేక, హైహయులు కొండల్లో దాగిన వారినందరినీ చంపారు. గర్భవతులుగా ఉన్న స్త్రీల గర్భాలను ఆయుధాలతో పొడిచారు.

ఈ దారుణ హింసాకాండ చూడలేక, ఆ ప్రాంతాల తీర్థాలలో ఉంటున్న మునులు హైహయులతో, "ఈ దుర్మార్గం కట్టిపెట్టండి. బ్రాహ్మణజాతిని ఈ విధంగా నిర్మూలించవచ్చునా? ఆడవాళ్ల గర్భాలు

**20.** లక్ష్మీదేవికి శాపం



కూడా ఛేదిస్తారా? ఇవి రాజులు చేసే పనులేనా? ఇంత పాపానికి ప్రతిఫలం ఉండదా?'' అని, మందలించారు.

దానికి హైహయులు, ''మీరు చాలా మహాత్ములు. కాని వీళ్ళు మా పూర్వుల దగ్గిర అంతులేని ధనం పుచ్చుకుని, దాచుకున్న దొంగలు! దొంగలను చంపటం పాపమా? అప్పు ఇయ్యరట! కార్తవీర్యుడు వీళ్ళకు డబ్బిచ్చింది పాతిపెట్టటానికా? ఇలాటి వాళ్ళను మీరు మెచ్చుతారా? చెప్పండి! యజ్ఞాలు చేయించి సంపాదించిన డబ్బును బ్రాహ్మణుడు తాను అనుభవించాలి, కటిక పేదలకు ఇయ్యాలి. లేకపోతే ధనం రాజులపాలో, దొంగలపాలో, అగ్గిపాలో అవుతుంది. అలా కాక, ధనం దాచిపెట్టినవాడు, తాను తిన్నవాడూ, ఇతరులకు పెట్టినవాడూ కాక పోవటమే గాక, చచ్చి నరకానికి పోతాడు. మేం మా పురోహితులైన ఈ భృగులను అప్పు అడిగాం. మా వృద్ధికోసమని అడిగితే ఇయ్యరు! ఇలాటి నీచులను మా వంటి రాజులు దండించటం తప్పా? అందుచేత మేం చేసే ఈ పనిని మీరు క్షమించాలి,'' అని మునుల చేత ఔననిపించి, భృగు స్త్రీల గర్భాలు నాశనం చెయ్యసాగారు.

ఆ స్త్రీలందరూ హడలిపోయి హిమవత్పర్వతానికి పారిపోయారు. ధనలోభంతో బ్రాహ్మణులు చచ్చారు. ధనలోభం ఎంతటి పనులనైనా చేయిస్తుంది. దాన్ని మించిన శత్రువు లేదు. కామక్రోధాహంకారాలను మించినది లోభం. లోభి ప్రాణాలైనా విడవటానికి సిద్ధపడతాడంటే, వాడు చేయరానిదంటూ ఏముంటుంది?

హిమాలయానికి పారిపోయిన భృగు స్త్రీలు మట్టితో గౌరీవిగ్రహం తయారుచేసి, నది ఒడ్డున ప్రతిష్ఠించి, దాన్ని పూజిస్తూ చావు కోసం ఎదురుచూడసాగారు.

ఇలా ఉండగా ఒక రాత్రి వాళ్ళకు దేవి అందమైన అవతారంలో కలలో కనబడి, ''మీలో ఒకతెకు తొడ నుంచి కొడుకు పుట్టుతాడు. నా అంశన పుట్టి, వాడు

మిమ్మల్ని కాపాడుతాడు,'' అని చెప్పింది. నిద్రలేచి ఆ స్త్రీలు ఎంతో ఆనందించారు.

వారిలో ఒకతె తన తొడలో గర్భం ధరించి ఉన్నది. ఆమె తొడ నుంచి పుత్రుడు వెలువడ్డాడు. వాడు సూర్యుడి లాగా వెలిగిపోతున్నాడు. ఆ స్త్రీలను వెతుక్కుంటూ వచ్చిన క్షత్రియులు ఆ పిల్ల వాణ్ణి చూడగానే వాళ్ళ కళ్ళు పోయాయి.

ఇదంతా బ్రాహ్మణ ప్రభావం కాబోలు నని భయపడుతూ హైహయులు ఆ స్త్రీని చేరి, ఆమె శరణు వేడుతూ, ''అమ్మా, నిన్ను చూస్తూనే మేం కాస్తా గుడ్డివాళ్ళమై పోయాం, నీ మహిమ ఏమిటో గాని! మమ్మల్ని అనుగ్రహించి, మాకు తిరిగి కళ్ళు తెప్పించు. గుడ్డి కన్న చావు మేలు గదా! ఇంకెన్నడూ దుర్మార్గాలు చెయ్యక, భృగువంశం వారికి విధేయులమై ఉంటాం. బుద్ధితక్కువగా మేం చేసిన తప్పులు క్షమించి, మాకు నేత్రదానం చెయ్యి. నువ్వూ, నీ కొడుకూ సుఖంగా ఉండగలరు,'' అన్నారు.

ఆ బ్రాహ్మణ స్త్రీ వారి మాటలకు ఆశ్చర్యపోతూ, ''మీ కళ్ళు ఎందుకు పోయాయో నాకు తెలీదు. నాకు మీ మీద ఏమీ కోపం లేదు. మిమ్మల్ని ఇలా చేసినది నా కొడుకు. మీరు దుర్మార్గులు! డబ్బు కోసం హత్యాకాండ సాగిస్తే ఊరికే పోతుందా? గర్భంలో ఉన్న పిండాలనూ, శిశువులనూ, వృద్ధులనూ విచక్షణ లేకుండా చంపారే! మిమ్మల్ని అణచ





టానికి వీడు పుట్టాడు. జగదంబ దయ వల్ల వీడు నా తొడ నుంచి పుట్టాడు. తన తండ్రులు చచ్చినందుకు చాలా కోపంలో ఉన్నాడు. వీణ్ణి వేడుకుని, శాంతింపజేయండి. మీకు కళ్ళు తిరిగి వస్తాయి,'' అన్నది.

తొడ (ఊరువు) నుంచి పుట్టిన కారణంగా ఆ కుర్రవాడికి ఔర్వుడని పేరు వచ్చింది. హైహయులు వాణ్ణి ప్రార్థించారు. దానితో ఔర్వుడు శాంతించి, వారితో ఇలా అన్నాడు:

''దేవి నిర్ణయాలు ఎలా తప్పుతాయి? ఆమె ఇచ్ఛానుసారం జరిగిన వాటిని గురించి జ్ఞాని అయినవాడు విచారించడు. ఇకనుంచీ ఋషుల సుఖానికి భంగం కలగకుండా చూడండి. వెళ్ళిరండి.''

హైహయులకు దృష్టి తిరిగి వచ్చింది. ఔర్వుణ్ణి తల్లి ఆశ్రమంలో తగిన విధంగా పెంచుతూ వచ్చింది.

భరతవంశానికి భరతుడు మూలపురుషుడు. యాదవవంశానికి యదువు మూలపురుషుడు. హైహయవంశం ఎలా ఏర్పడింది? దీనికి ఒక కథ ఉన్నది.

సూర్యుడి కొడుకైన రేవంతుడు అనేవాడు ఉచ్చైఃశ్రవం అనే గుర్రాన్ని ఎక్కి, విష్ణువును చూడగోరి వైకుంఠానికి వెళ్లాడు. లక్ష్మి తన అన్న అయిన (తనతోబాటు సముద్ర మథనమప్పుడు పుట్టిన) ఉచ్చైఃశ్రవాన్నీ, దాని మీద ఉన్న అందగాణ్ణీ సమ్మోహితురాలై చూడసాగింది.

''మూడు లోకాలలోనూ సాటిలేని అందగాడు! ఆ గుర్రం ఎక్కి వస్తున్న వాణ్ణి ఎరుగుదువా?'' అని విష్ణువు లక్ష్మిని అడిగాడు.

కాని రేవంతుడి అందంతో సమ్మోహితురాలై ఉన్న లక్ష్మికి తన భర్త అడిగినది వినిపించలేదు. విష్ణువు ఆమె స్థితి గ్రహించి, కోపావేశంతో ఇలా అన్నాడు:

''ఏమిటి అలా చూస్తావు? ఆ గుర్రాన్ని చూసి నీ మనస్సు వివశమైపోయింది. రతివీ, రమవూ అనిపించుకుంటూ.

చంచలస్వభావంతో అపకీర్తి పాలైపో! భూలోకంలో ఆడగుర్రానివై పుట్టు!''

ఈ శాపానికి లక్ష్మి బెదిరిపోయి, ఏడుస్తూ విష్ణువు కాళ్ళమీద పడి, ''నన్ను నిర్దయగా ఇలా శపించుతావా? ఈ కాస్త భాగ్యానికి నా మీద నీకు సహజంగా ఉండే ప్రేమ పోయిందా? కోపమనేది ఎన్నడూ ఎరగని, వెన్నలాటి నీ స్వభావం ఇంతలో ఇలా మారిందా? నిన్ను విడవటం జరిగితే ఇప్పుడే ప్రాణాలు విడుస్తాను. దయచేసి శాపవిమోచనం చెప్పు.'' అన్నది.

విష్ణువు మనస్సు కరిగింది. అతను లక్ష్మితో, ''నీ గర్భాన నన్ను పోలిన కొడుకు పుట్టగానే నీకు శాపం తీరిపోతుంది.నావద్దకు తిరిగివస్తావు,''అన్నాడు.

రేవంతుడు కూడా విష్ణువు కోపంగా ఉన్నట్టు గ్రహించి, చప్పున నమస్కారం చేసి, శలవు తీసుకుని, తన తండ్రి వద్దకు వెళ్ళి, జరిగిన సంగతి చెప్పాడు.

లక్ష్మి కూడా తన భర్త వద్ద శలవు తీసుకుని, సువర్ణాక్ష మనే చోటికి చేరి, ఆడగుర్రం రూపంలో శివుణ్ణి గురించి తపస్సు చేయసాగింది.

ఆమె తపస్సుకు మెచ్చి, శివుడు పార్వతీ సహితంగా వృషభవాహనం మీద, ప్రమథులను వెంటబెట్టుకుని వచ్చి, ఇలా అన్నాడు:



''అమ్మా, నా కోసం ఎందుకు తపస్సు చేస్తున్నావు? ఏది ఇయ్యటానికైనా సమర్థుడు విష్ణువు గదా! వివేకంగల స్త్రీకి భర్త కన్న గొప్ప దైవం ఎక్కడన్నా ఉంటాడా? పోనీ నీ భర్త సామాన్యుడు కనకనా?''

''అదంతా నిజమే. కాని ఆ మొగుడే శాపం ఇచ్చాడు. దానికి నీ దయవల్ల విరుగుడు కలుగుతుందని నిన్ను గురించి తపస్సు చేశాను. కొడుకు పుట్టితే శాపం పోతుందట. ఎలా పుట్టుతాడు కొడుకు? దయచేసి చెప్పు. నా భర్త ఎక్కడో వైకుంఠంలో ఉన్నాడు. నేనేమో ఇక్కడ అరణ్యంలో ఉన్నాను. మాకు సంతానం



కలిగేది ఎలా? నా తపస్సుకు నువు నిజంగా తృప్తిపడితే నా కోరిక తీర్చు. నీకూ నా భర్తకూ తేడా ఏమీలేదు. నిన్ను కోరితే అతన్ని కోరినట్టే! అందుచేత నా భర్త ఎలాగైనా వచ్చి, నన్ను కలిసేటట్టు చెయ్యి.'' అన్నది ఆడగుర్రం రూపంలో ఉన్న లక్ష్మి.

దానికి శివుడు, ''విచారించకు. నీ భర్త గుర్రం రూపంలో నీ వద్దకు వస్తాడు. మీకు కొడుకు కలుగుతాడు. వాడు ప్రపంచాన్ని అంతనూ ఏలుతాడు. వాడికి ఏకవీరు డని పేరు వస్తుంది. వాడితో హైహయవంశం ఆరంభ మవుతుంది. ఆ తరవాత నువూ, నీ భర్తా వైకుంఠానికి వెళ్ళి, సుఖంగా ఉండండి. నీకు ఇలా కష్టాలు కలగటానికి కారణం పరశక్తిని గుర్తించి, కొలవక పోవడమే.'' అని వెళ్ళిపోయాడు.

ఆయన కైలాసం చేరుతూనే చిత్ర రూపుడు అనే ప్రమథుణ్ణి పిలిచి, ''నువు వైకుంఠానికి వెళ్ళి, విష్ణువుతో, నీ భార్య శోకం పోగొట్టమని స్నేహ పూర్వకంగా చెప్పానని చెప్పు,'' అని పంపేశాడు.

చిత్రరూపుడు వైకుంఠానికి వెళ్ళి, విష్ణువు ఇంటి ద్వారపాలకులైన జయ విజయులతో తాను వచ్చినట్టు విష్ణువుకు చెప్పమన్నాడు.

జయుడు లోపలికి వెళ్ళి విష్ణువుతో, ''శివుడు పంపగా చిత్రరూపు డనే వాడు వచ్చాడు. వాణ్ణి లోపల ప్రవేశపెట్ట వచ్చునా?'' అని చెప్పేసరికి, విష్ణువు వెంటనే ప్రవేశపెట్టమన్నాడు.

చిత్రరూపుడు లోపలికివచ్చి, విష్ణువుకు నమస్కరించి క్షేమసమాచారాలు అయినాక, ''దేవా, తమతో ఒక్క విషయం చెప్పటానికి వచ్చాను. శివుడు తమతో ఇలా చెప్పమన్నాడు: 'నీ భార్య లక్ష్మి గుర్రం రూపంలో కాళిందీ, తమసా నదుల సంగమం వద్ద ధ్యాననిష్ఠలో క్షేమంగా ఉన్నది. లక్ష్మిని దేవతలంతా పూజిస్తారు. ఆమె అనుగ్రహం పోగొట్టు

కుని ఏ మానవుడూ సుఖంగా ఉండలేడు. అలాటి భార్యను దూరం చేసుకుని నువు మాత్రం ఏం సుఖంగా ఉండగలవు? మామూలు మనిషి కూడా భార్యను వదులుకోలేడు. అలాటప్పుడు నిష్కారణంగా నీ భార్యను నువు ఎలా వదిలి పెట్టావు? నా మాట విని, వెంటనే వెళ్ళి ఆమెను ఓదార్చి, చేరదీసుకో. దక్ష యజ్ఞంలో భార్యను పోగొట్టుకున్నప్పుడే నాకు భార్యావియోగం ఏమిటో తెలిసింది. అందుచేత ఎవరికి భార్యావియోగం కలిగినా నాకు కష్టంగా ఉంటుంది. భార్య నీకు దూరమై చాలా కాలమయింది. నువు ఏం సుఖపడ్డావు? వెంటనే గుర్రం రూపంలో నీ భార్య ఉన్నచోటికి వెళ్ళు.'' అన్నాడు.

విష్ణువు ఈ సందేశం వింటూనే గుర్రం రూపంలో లక్ష్మి వద్దకు వెళ్ళాడు. ఇద్దరికీ కొడుకు కలిగాడు.

తరవాత విష్ణువు లక్ష్మితో, ''మనం వైకుంఠానికి తిరిగి పోదాం. ఈ కొడుకును ఇక్కడే విడిచిపెట్టుదాం. గుర్రం రూపం వదిలెయ్యి.'' అన్నాడు.

''ఏ స్త్రీ గాని తన గర్భాన పుట్టిన శిశువును అడవిపాలు చెయ్యటానికి ఒప్పుకుంటుందా? ఈ నదీతీరంలో ఈ బిడ్డను ఎవరు కాపాడుతారు?'' అని లక్ష్మి అంటూండగానే వారిద్దరికీ దివ్యశరీరాలు తిరిగి వచ్చాయి. వారి కోసం విమానం కూడా వచ్చింది.

లక్ష్మి తన కొడుకును ఎత్తుకుని, "వీడు అన్నివిధాలా నిన్ను పోలినవాడు. వీణ్ణి వదిలి పెట్టను. ముగ్గురమూ పోదాం.'' అన్నది.

''వీడి వల్ల ఒక కార్యం ఉన్నది. యయాతికి తుర్వసుడు అనే కొడుకు ఉన్నాడు. అతను పిల్లల కోసం తపస్సు చేస్తున్నాడు. అతను ఈ శిశువును పెంచుకునేటట్టు చూస్తాను. తుర్వసుడు ఇక్కడికి వచ్చేదాకా వీడికి ఏ భయమూ రాదు." అని విష్ణువు లక్ష్మికి నచ్చజెప్పి, ఆమెతో సహా వైకుంఠానికి వెళ్ళిపోయాడు.



# వైరం

రామాయమ్మా, కామాయమ్మా ఇరుగు పొరుగు స్త్రీలు, సఖ్యంగా ఉంటూ, అకస్మాత్తుగా ఏదో చిలిపికారణం మూలాన బద్ధశత్రువులై పోయారు. వారి పోరు వీధి కంతకూ వినోదమయింది, కాని వాళ్ళ భర్తలకు మాత్రం తల వంపులయింది.

తమ పెళ్ళాల వైరం అరికట్టాలనుకుని మగవాళ్ళు ఒక పథకం ఆలోచించారు. రామాయమ్మ భర్త ఒకకుక్క పిల్లను తెచ్చాడు. అలాగే కామాయమ్మ భర్త ఒక పిల్లిపిల్లను తెచ్చాడు. ఇద్దరూ వాటిని పెంచుకోసాగారు.

కొంత కాలంపాటు అవి ఒక దాన్ని ఒకటి చూసినప్పుడు ఆగ్రహంతో మొరగటమూ, కస్సుమనటమూ చేసేవి. వాటిని చూసి నలుగురూ ఆనందించేవారు.

క్రమంగా మగవాళ్ళు ఆ పిల్లికీ, కుక్కకూ ఒకే బొచ్చె నుంచి తినటం నేర్పారు. చూస్తూండగానే అవి ఒక దాన్ని చూసి ఒకటి ఆగ్రహించటం మానేశాయి; త్వరలోనే ఆడుకోవటం కూడా ప్రారంభించాయి.

"మనుషుల కన్న నోరులేని జంతువులు నయం," అని అందరూ గట్టిగా అనటం విని, రామాయమ్మా, కామాయమ్మా పోరు మానేసి, మెల్లిగా స్నేహంకూడా అవలంబించారు.

—ఎస్. సంజీవరావు





# తల్లిలేనివాడు

రంగడు తల్లి చెప్పినమాట బొత్తిగా వినే వాడు కాడు. అల్లరిచిల్లరగా తిరుగుతూ, అకతాయిపనులు చేస్తూ, డబ్బు దుబారా చేసేవాడు. వాడి భవిష్యత్తు గురించి తల్లి బెంగపడేది.

ఒకసారి రంగడు ఎవరో పెద్దమనిషితో గొడవపెట్టుకుని, దురుసుగా మాట్లాడాడు. అయన రంగణ్ణి తన్నడానికి సిద్ధంకాగా, వాడి తల్లి వెళ్ళి, ఆయన కాళ్ళా, వేళ్ళాపడి, కొడుకును రక్షించుకున్నది.

తరవాత ఆమె, ''ఎందుకురా పెద్ద, పెద్దవాళ్ళతో గొడవలు తెచ్చుకుంటావు?'' అని రంగడిని మందలించింది.

తన తప్పు ఏమీ లేదనీ, ఆ పెద్దమనిషి తనతో అమర్యాదగా మాట్లాడాడనీ రంగడు తల్లితో అన్నాడు.

''మనకు డబ్బు లేదు. ధనవంతులు మనలాటి వాళ్ళని ఎన్ని మాటలన్నా, ఎంత అగౌరవంగా చూసినా సహించాలి,'' అన్నది రంగడితో తల్లి.

ఈ మాట రంగడికి నచ్చక, సహించక పోతే ఏమవుతుందని అడిగాడు.

''తినడానికి తిండి కూడా దొరకదు,'' అన్నది తల్లి.

''పెద్దవాళ్ళతో దెబ్బలాడితే నువ్వు కూడా నాకు తిండి పెట్టవా?'' అని రంగడు తల్లిని అడిగాడు.

తల్లి వాణ్ణి అక్కున చేర్చుకుని, ''ఎందుకు పెట్టనురా, బాబూ? అయితే ఎల్లకాలమూ నేను బ్రతికి ఉండను గదా! అదే నా బాధ,'' అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నది.

తాను కూడా గొప్పవాడు కావాలని రంగడికి అనిపించింది. అదిమొదలు వాడు గురువు వద్దకు వెళ్ళి, శ్రద్ధగా విద్యాభ్యాసం చెయ్యసాగాడు. అయినప్పటికీ,

జొన్నలగడ్డ రామలక్ష్మి

తనను ఎవరైనా అనవసరంగా మాటలంటే పడేవాడు కాడు. దురదృష్టవశాన రంగడి విద్యాభ్యాసం పూర్తికాకముందే రంగడి తల్లి చనిపోయింది.

రంగడితో వాడి గురువు, "నీకు చదువు బాగా వస్తున్నది. ఎలాగో మరి రెండేళ్ళు శ్రమపడ్డావంటే నీ చదువు పూర్తి అవుతుంది. రోజు కొక ఇల్లు చొప్పున వారాలు ఏర్పాటు చేసుకుని, చదువు ముగించు," అన్నాడు.

రంగడు వారాల పిల్లాడు అయాడు.

వారాలు చేసే ఇళ్ళలో రంగడికి చాలా పనులు చెప్పేవాళ్ళు. చెప్పిన పనులు ఎంత బాగా చేసినా ఏదో వంకపెట్టి, అస్తమానమూ తిట్టుతూ ఉండేవారు. మొదట్లో వాడికి ఇది కష్టంగా ఉండేది. కాని క్రమంగా దీనికి అలవాటు పడ్డాడు.

ఒక ఇంట్లో మొక్కలకు నీళ్ళు పోస్తుంటే, "ఒరే, అంత ఎక్కువగా నీళ్ళు పోస్తే, మొక్క కుళ్ళి చస్తుంది," అనేవారు.

అలా అని నీళ్ళు కొంచెం తగ్గించి పోస్తే, "అలా కొంచెంగా నీళ్ళు పోస్తే, ఎండకు నీరు ఆవిరి అయి, మొక్క ఉడికి చచ్చిపోతుంది," అనేవారు.

ఇలా రంగడు ఏది చేసినా తప్పుగానే ఉండేది. అయినా రంగడు సహించి ఊరుకునేవాడు. క్రమంగా వాడు తన సహనంతో వారాల ఇళ్ళవాళ్లనే కాకుండా ఊళ్ళోవాళ్ళను కూడా మెప్పించాడు.

64



61

ఆ ఊళ్ళో ఒక మోతుబరి కొడుకు, రాముడు అనేవాడు, రంగడి ఈడువాడే, ఉండేవాడు. పెద్దవాళ్ళ నుంచి మాటపడే వాడు కాదు, అందరినీ ఎదిరించేవాడు.

ఒకనాడు రాముడి తల్లి వాడితో విసిగి పోయి, "ఆ రంగణ్ణి చూసి నేర్చుకో రాదుట్రా? ఎంతో కష్టపడి చదువుకుంటున్నాడు. అయినా వాడికి కొంచెం కూడా గర్వం లేదు. ఎవరినీ పల్లెత్తుమాట అనడు," అన్నది.

ఇది ఎంతవరకు నిజమో చూడాలని రాముడు రంగడిని ఒక కంట కనిపెట్టుతూ వచ్చాడు. ఒక ఇంట్లో రంగడు ఏడుస్తున్న పిల్లను ఎత్తుకోనందుకు తిట్లుతిన్నాడు. ఇంకో ఇంట్లో ఏడుస్తున్నపిల్లనుఎత్తుకుంటే, రంగడు పిల్లకు ఎత్తు మరిగిస్తున్నాడని తిట్టారు. ప్రతి ఇంట్లోనూ వాడు ఎందుకో ఒకందుకు తిట్లు తింటూనే ఉన్నాడు, తిట్లను సహిస్తూనే ఉన్నాడు.

రాముడు రంగడితో, "నీ ఓర్పు అద్భుతం! అవమానాలన్నీ నువు ఎలా సహించగలుగుతున్నావు?" అని అడిగాడు.

"మాటలంటే ఏం? వాళ్ళ మనసు అమృతం! నాకు రోజూ కడుపునిండా తిండి పెడుతున్నారు. నేనంటే అభిమానంగా ఉంటున్నారు," అన్నాడు రంగడు.

"పట్టెడు అన్నం కోసం మాటలు పడటం సాధ్యమా?" అని రాముడు ఆశ్చర్యంగా అడిగాడు.

"మా అమ్మ బ్రతికి ఉన్నంత కాలమూ నాకు కూడా అది సాధ్యం కాలేదు," అన్నాడు రంగడు.

అసలు విషయం రాముడికి అర్థమయింది. తల్లి కొడుకుకు పెద్ద అండ! ఎవరు తిట్టినా ఆదరిస్తుంది. తల్లిలేని వాడికి ఓర్పులేకపోతే, వాణ్ణి ఎవరు ఆదుకుంటారు?

ఆ రోజు నుంచీ రాముడు తల్లి చెప్పినట్టు వింటూ, ఓర్పు అలవరుచుకున్నాడు.



# వింతమనస్తత్వం

భీమయ్య పిసినారి మాత్రమే కాదు, మానవద్వేషి కూడా. అందుచేత అతను తన చర్యల వల్ల ఎవరికైనా నష్టంగాని, హానిగాని కలిగినట్టు తెలిస్తే ఎంతగానో ఆనందించేవాడు.

అతను నిశిరాత్రివేళ రెండు మూడు సార్లు లేచి తన ఇనప పెట్టె తెరిచి డబ్బు సరిగా ఉన్నదో లేదో చూసుకుని, దాని తలుపుతో పెద్దగా చప్పుళ్ళు చేసి, చుట్టుపక్కల వాళ్ళకు నిద్రా భంగం కలిగించేవాడు.

చుట్టు పక్కల వాళ్లు, "నీ మూలంగా మాకు తెల్లవార్లూ నిద్రలేకుండా పోతున్నది," అని అంటే, లోపల సంతోషిస్తూ, "ఏం చెయ్యను? ఇనప్పెట్టె తలుపు బిగుసుకుపోవటం వల్ల అలా చప్పుడవుతున్నది," అనేవాడు.

భీమయ్య పొరుగింటికి వచ్చిన బంధువు ఒకాయన భీమయ్య మూలంగా తెల్లవార్లూ నిద్ర పోలేక, భీమయ్య గురించి తెలుసుకుని, మర్నాడు పొద్దున భీమయ్యను కలుసుకుని, "మీరు నిజంగా మీ ఇరుగు పొరుగుకు ఎంత ఉపకారం చేస్తున్నారండీ! మీరు రాత్రిపూట చేసే చప్పుళ్ళ మూలంగా చుట్టుపక్కల ఏ ఇంటికీ దొంగల భయం ఉండదు!" అన్నాడు.

అంతే! భీమయ్య రాత్రిపూట చప్పుళ్ళు మానేశాడు. —గుండాల విజయ



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1980 జులై నెల సంచికలో ప్రకటింపబడును.



A. K. Chatterjee





S. Paramasivan

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకు సంబంధం ఉండాలి.)

★ మే నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రూ. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : శ్రమకు మొదలు

రెండవ ఫోటో : స్వేచ్ఛకు అంతం

పంపినవారు : టి. నరసింహారావు, పవర్ హౌస్ రోడ్, ప్రొద్దుటూరు.

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.



# చందమామ

## చందాదారులకు గమనిక



చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెలవరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.



డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 600026

చందమామ அம்புலி மாமா





Chandamama is published in TWELVE INDIAN Languages including English: educating and entertaining millions of readers. Our SINHALA Language edition is now dedicated to delight the children of SRILANKA

**CHANDAMAMA**

*the magazine for children makes the young and old WISE.*




চাঁদমামা CHANDAMAMA चांदोबा